# శ్రీ దయానంద హృదయము

(సరళ విస్తృత వ్యాఖ్యా సహిత ఆర్యసమాజ నియమములు)



రచయిత :
జోస్యు వేంకట నరసింహారావు
(ఉభయ భాషా ప్రవీణ)

(స్వ. శాంతానంద సరస్వతి)

ప్రకాశకులు :
గాయత్రీ ఆశ్రమ ప్రచురణ

గాయత్రీ గ్రంథమాల - 28
ప్రతులు : 2000

ఈశ్వర కార్తీకము (నవంబర్ 1997)

మూల్యము : **రూ. 12=00**
**(ప్రచారార్థము ప్రత్యేక తగ్గింపు ధర)**

ప్రతులకు :

1) గాయత్రీ ఆశ్రమ ట్రస్టు, వ్యాస్ నగర్, సికింద్రాబాద్ - 61
2) స్వస్తిక్ మెటల్ ప్రాడక్ట్స్, 3-3-738, కంచరి బజార్, సికింద్రాబాద్ - 3.
3) వైదిక సాహిత్య భండార్, ఆర్యసమాజము, సుల్తాన్ బజార్, హైదరాబాద్ - 500 001.
4) ఆర్. కృష్ణమూర్తి బుక్ సెల్లర్స్, ఆర్యసమాజ మందిరము, సీతాఫలమండి, సికింద్రాబాద్ - 61.



రచయిత :

శ్రీ జొస్యుల వేంకట నరసింహారావు గారు

( స్వ. స్వామి శాంతానంద సరస్వతి )

# కృతజ్ఞతలు

మహర్షి దయానంద సరస్వతి ఆర్యసమాజ సంస్థను స్థాపించినపుడు సంస్థ కార్యకలాపాలను సజావుగా నిర్వహించుటకై దశనియమాల నేర్పరచారు. ఆర్యసమాజికులందరికీ ఈ నియమాలను గూర్చి మంచి అవగాహన ఉండాలి. లేనిచో ఆర్యసమాజాభివృద్ధి కుంటుపడుతుంది. భగవంతునిపైనా, సత్యముపట్ల అచంచల విశ్వాసంగల మహర్షి ఈ నియమాలనెంతో భావగర్భితంగా రచించారు. సాధారణ బుద్ధితో ఈనియమాలలోని సారాంశమును గ్రహించటం కష్టమౌతుంది.

పూర్వాశ్రమంలో ఉభయభాషా ప్రవీణులైన శ్రీ జాస్తి నరసింహారావు గారు (తదుపరి సంన్యాసాశ్రమమును గ్రహించి శాంతానంద సరస్వతియైరి) నాకు బాగా పరిచితులు. కూచిపూడి ఆర్యసమాజ వార్షిక ఉత్సవాలలో వారిని కలిసేవాడిని. గురువర్యులైన పం. గోపదేవ్ శాస్త్రి గారి సాంగత్యంతో వైదిక సిద్ధాంతాల పరిచయమేర్పడిన వీరు స్వల్ప సమయంలోనే బాగా రాణించారు. వైదిక సిద్ధాంతాలను నిరంతరం అధ్యయనం చేసి అనేక సిద్ధాంత గ్రంథాలను కూడా రచించారు. "శ్రీ దయానంద హృదయ" మనే ఆర్యసమాజ నియమాల వ్యాఖ్యాన గ్రంథము వీరి రచనలలో ఆణిముత్యము. ఋషి హృదయాన్ని విస్తృతంగా అధ్యయనం చేసి ప్రతినియమంలోని ప్రత్యేక శబ్దమునకు సామాన్యులకు కూడా అర్థమయ్యే రీతిలో వ్యాఖ్యానం చేశారు. వీరి రచనాశైలి అద్భుతం. ఈ గ్రంథంలో అనేక సందర్భాలలో ఆర్యసామాజికులకు కర్తవ్య బోధతో పాటు మార్గదర్శనం కూడా చేశారు. ఋషి ఏర్పరచిన నియమాలకు అనేక ప్రమాణాలతో కూడిన వీరి వ్యాఖ్యానం సువర్ణమునకు సుగంధ మబ్బినట్లున్నది.

ఒకటి రెండు సార్లే ముద్రింపబడిన ఈ గ్రంథం చాలాకాలంగా లభ్యం కానందున అనేకమంది మిత్రులు దీని పునర్ముద్రణను కోరుతున్నారు. గ్రంథకర్త శ్రీ శాంతానందసరస్వతి స్వర్గస్థులైనందున పునర్ముద్రణకు అవకాశాలు కనబడుటలేదు. మా గాయత్రీ ఆశ్రమ ట్రస్టు నుండి ముద్రించాలనే ఆలోచనను భగవత్ ప్రేరణగా తలంచిన నేనీ గ్రంథ పునర్ముద్రణకు పూనుకున్నాను.

గ్రంథకర్త స్వ. శ్రీ శాంతానంద సరస్వతి గారికి హృదయపూర్వక వందనములతో

ఈశ్వర కార్తీక దశమీ
(24-11-1997)

సంధ్యావందనం శ్రీనివాసరావు
(కార్యదర్శి - గాయత్రీ ఆశ్రమ ట్రస్టు)

# మొదటి మాటలు

దేశంలో పలురకములయిన సమాజములు, సంస్థలు ఉన్నవి. సంఘము, సమాజము, సంస్థ, పార్టీ ఇత్యాది నామములన్నియు సమానార్థక ములుగా వాడబడుతూ ఉన్నవి. ఈ సమాజములు ఆ యా కాలములలో పరిస్థితులను బట్టి యేర్పడుతూ ఉంటవి.

ఆధ్యాత్మిక సంఘములు, రాజకీయసంఘములు, మతసంస్థలు, వర్తక సంఘములు, కర్షక సంఘములు, ఉపాధ్యాయసంఘములు, విద్యార్థి సంఘములు, బ్రాహ్మణసంఘములు, క్షత్రియ సంఘములు, వైశ్యసంఘములు, రజక సంఘములు, మహిళా సమాజములు - ఇట్లు ఒకటేమిటి ఎన్నో రకముల సంఘములు వేర్వేరు ప్రయోజనముల సాధించు నిమిత్తం ఏర్పడుతూ ఉంటవి. కాని యివి సాధింపదలచిన ప్రయోజనాన్ని బట్టి కొన్ని విశాలదృష్టి కలవి కాగా కొన్ని సంకుచిత దృష్టి కలవిగా ఉంటవి. కొన్ని దీర్ఘకాలం పనిచేయుచుండగా మరికొన్ని తాత్కాలికములై అనతికాలంలోనే అస్తమిస్తూ ఉంటవి.

అయితే ప్రతి సంస్థ-సమాజము తమ యుద్దేశ్యం నెరవేర్చుటకు ఏవో కొన్ని నియమాలు పెట్టుకొని నడుస్తూ ఉంటుంది ; పనిచేస్తూ ఉంటుంది. నియమాలు లేని సమాజంగాని సంస్థగాని ఉండనేరదు. నియమాలు - కట్టుబాట్లు - లేని సమాజం కట్టలు తెగిన (లేని) తటాకం వంటిది. నిష్ప్రయోజనం. అది మనజాలదు. కనుక ఆయా సమాజముల యొక్క విశిష్టత - గొప్పతనం, జీవితం తెలుసుకోవాలంటే వాటి యుద్దేశ్యం, నియమాలు చూస్తే చాలు. మంచిచెడ్డలు అర్థమవుతవి.

ఆర్యసమాజం దేశకాలపరిస్థితులను బట్టి వంద సంవత్సరాల క్రిందట క్రీ.సం. 1875లో స్థాపింపబడినది. కాని యిది తాత్కాలిక సమస్యలను తీర్చుటకు ఉద్భవించిన సంస్థ కాదు. అట్లయితే యిది ఇంతకాలం ఉండక అనతి కాలంలోనే అస్తమించి ఉండేది. వేదధర్మాలను ప్రచారం చేయుటకు ఉద్భవించిన సంస్థ యిది. కాన దీని నియమాలు సార్వకాలికములు; సార్వదేశికములు. దీని ఉద్దేశ్యం ప్రపంచమునకు ఉపకారం చేయుట.

ఆ ఉపకారంకూడ శారీరికోన్నతికి, ఆత్మికోన్నతికి, మరియు సామాజికోన్నతికి పాటుపడుట యని యీ ఆర్యసమాజనియమములలో ఆరవనియమం చెప్పుతున్నది. ఇందులో శారీరికోన్నతి, ఆత్మికోన్నతి ఆధ్యాత్మికములు. మరి సామాజికోన్నతియో ఒక రకం గాదు. సర్వవిధముల యున్నతి అందు గర్భితమై ఉన్నది. అనగా - సమాజోన్నతికి ఎన్నిరకాల సంస్థలు వెలసి, ఎన్ని విధముల పాటుపడుతున్నవో, అన్ని విధములా ఆర్యసమాజం పాటు పడవలెననియే దీని భావం.

ఈ ఉపకారం కూడ దేశం, జాతి, మతం, కులం, తెగ, స్త్రీలు, పురుషులు - అను భేదం లేక సర్వ ప్రపంచానికి చేయవలెనని నియమం ఆదేశిస్తున్నది. ఇట ప్రపంచపదం చాల విశాలమైన అర్థంలో వాడబడినది. అనగా ఒక మానవజాతికే కాక పశుపక్ష్యాది సర్వప్రాణులకు ఉపకారం చేయవలెనని దీని భావం. ఏలయనగా - నిత్యకర్మలయిన పంచమహా యజ్ఞములలో భూతయజ్ఞం ఒకటిగా చేర్చి వైదిక దినచర్యను ఏర్పరచిన దయానందమహర్షి స్థాపించిన సమాజం యిది. కనుక ప్రాణిమాత్రమునకు ఉపకారం చేయనెంచుట విచిత్రం కాదు. ఏప్రాణిని హింసింపరాదనియే వేద మాదేశిస్తున్నది గదా!

లౌకిక ప్రయోజనముల సాధించుట కేర్పడిన రాజకీయాదిసంఘముల మాట యటుండ - ఆస్తికములయిన ఆధ్యాత్మిక సంఘములుగాని మతసంస్థలుగాని ఏవియు ఇంతటి విశాలభావంతో ఏర్పడినట్లు కానము. ఏలయన - క్రైస్తవులుగాని మహమ్మదీయులుగాని తమ్మనుసరింపనివారిని అన్యులని, పాపులని పేరుపెట్టి శత్రువులుగా చూస్తారు. జీవహింస వారికి శాస్త్ర సమ్మతం. మరి హిందువు లనబడే ద్వైతాద్వైతవిశిష్టాద్వైత - ఆది సంప్రదాయములలో గూడ ఒకరిని చూచిన మరొకరికి గిట్టదు. ఒకరి దేవుడు మరొకరికి పనికిరాడు. అంతేగాదు. మనుష్యజాతిలోనే స్త్రీ శూద్రులకు వేదాధ్యయనం నిషేదింపబడినది.

ఇట్టి ఆస్తికములయిన యీ మతములలో దేవుని విషయంలో గూడ ఏకాభిప్రాయం లేదు. పైగా దేవునిస్థానం ప్రతిమలు, గురువులు, ఆక్రమించి

పూజింపబడుట చూస్తున్నాము. ఇట్లు స్వార్థంతో సంకుచితదృష్టితో మడికట్టుకొని, గిరిగీసి హద్దులు పెట్టుకొని ఎవరికి వారు తమతమ పరిధులలో దేశమునకు, సంఘమునకు, ప్రాణికోటికి సేవ చేస్తున్నట్లు తలుస్తూ ఉంటారు ; భ్రమిస్తూ ఉంటారు. లేదా గట్టిగా చెప్పాలంటే నటిస్తూ ఉంటారు; ధర్మానికి ఇన్ని మార్గములు ఉంటాయా? ఉండవు. ఒక్కటే ఉంటుంది. కావున స్వార్థపరత, సంకుచిత భావం వీరిని ఇన్ని విధముల వేరు చేసినదని వీరు పెట్టుకొన్న నియమములే వీరి యాచరణయే మనకు చెప్పక చెప్పుచున్నవి.

మరి ఆర్యసమాజ - ఉద్దేశ్యములు దెల్పు పై నియమాన్ని (6) చూచితిరిగదా? దానికేమైన హద్దులున్నవా? లేవు. సర్వ ప్రపంచానికి సర్వ విధముల సేవచేయాలంటున్నది. దానిని వీరెవరైన కాదనగలరా? వ్యతిరేకింప గలరా? ఒక వేళ కాదన్న, సంకుచిత భావమున్నవారు కాదనాలి. ఏలయనగా - జీవహింస నపేక్షించువారి కిది పూర్తిగ నచ్చకపోవచ్చు. స్త్రీ శూద్రులకు విద్య నరికట్టువారి కిది కొంత సరిపడకపోవచ్చు. కాని వైదికులు, ఆస్తికులు అయిన వారెవరును దీనిని కాదనజాలరు.

ఇట ఒక విషయం గమనింపవలసి ఉన్నది. ఏమంటే - భారతీయ వేదేతరమతములవారెవరెవరు కాదనినా, తమతమ సిద్ధాంతముల ప్రచారం చేసినా, వేదసిద్ధాంతములే తాము చెప్పుచూ ఉన్నట్లు శ్రోతలకు భ్రమ కలిగిస్తూ ఉంటారు. కారణం ఏమి? ప్రజలు వేదవిరుద్ధవిషయాలను విశ్వసింపరు గనుక. వేదములపై ప్రజలకు భక్తిశ్రద్ధలు ఉన్నవి గనుక. అట్లు చేస్తారు. అయితే ఆర్యసమాజం పుట్టకపూర్వం, వేదములు అజ్ఞాతవాసంలో ఉన్నప్పుడు ఇట్టి అవైదికమతములవారు ఏమాటలు చెప్పినా చెల్లినవి ; ఏ ఆటలు ఆడినా సాగినవి. కాని వేదములు ఇప్పుడు అచ్చయి అందరికి అందుబాటులో ఉన్నవి. కాన అట్టి మోసమున కవకాశం లేదు. వారి మాట లిప్పుడు చెల్లవు ; ఆటలూ సాగవు. ఇట్లు భారతీయ వేదేతర మతములవారు కూడ వేదముల ప్రామాణ్యమును అన్యాపదేశముగా అంగీకరింతురనుటలో సందేహం లేదు.

కాబట్టి వేదధర్మముల ప్రచారం చేయుట కేర్పడిన ఆర్యసమాజ ఎంతటి విశాలదృష్టితో ఉద్భవించినదో దీనినిబట్టి తెలియగలదు. ఇంతకు

దీనిని స్థాపించినవా రెవరు? మహర్షి దయానంద సరస్వతి. ఆయన ఋషి. వేదమంత్రములకు భాష్యం వ్రాసిన తపస్వి. ఈశ్వరీయములగు వేద మంత్రములకు భాష్యం వ్రాసిన తపస్వి. ఈశ్వరీయములగు వేదమంత్రముల యాధారంతో వైదిక ధర్మములను ప్రచారం చేయుటకు ఆ మహర్షిచే స్థాపింపబడిన సమాజం ఇది. కనుక వేదము లున్నంతకాలం, మానవజాతి ఉన్నంతకాలం, వేదములపై మానవులకు విశ్వాసం ఉన్నంత కాలం ఈ సమాజం అభివృద్ధి చెందుతూ ఉండవలసినదే. సజీవంగా పనిచేస్తూ ఉండవలసినదే

ఇక తక్కిన ఆర్యసమాజనియమములు తొమ్మిదియు ఆరవ నియమంలో చెప్పిన సమాజోద్దేశ్యమును సాధించుటకు అనుగుణంగానే రచింపబడినవి. ఏ మతసంస్థ, ఆధ్యాత్మిక సంఘము - ఇది యది యననేల! దేశసేవ, సంఘసేవ చేయదలంచు నే ఆస్తికసమాజమును ఈ నియమములను వ్యతిరేకింపజాలదు. వేదార్థం గ్రహింపజాలని నాస్తికసమాజములు కూడ వేదమును, సృష్టికర్తను గురించి చెప్పిన మొదటి మూడు నియమములను అంగీకరింపకపోవచ్చు. కాని తక్కిన నియమములను కాదనజాలవు. అయినా ఆ నాస్తికసమాజములకు కూడ సమాజమును ఒక కట్టుబాటులో ఉంచుటకు - నడుపుటకు ఏదేని ధర్మగ్రంథం ఉండక తప్పదు. కాన ఈశ్వరీయ వేద ప్రామాణ్యమునకు బదులు మరొక మానవరచిత గ్రంథప్రామాణ్యము నవి యంగీకరించాలి. అది వేదమువలె సమస్త సత్యవిద్యల గ్రంథంగా రాణింపగల్గునా? అసంభవము.

ఇట ఇంకొక రహస్యంకూడ ఉన్నది. ఏమన - హిందూ (భారత) జాతి కంతకూ వేదములే యాధారం. అవి ప్రచారంలో ఉన్నచో - ఒక్క బైబిలు మతగ్రంథంతో సమస్త క్రైస్తవజాతియు ఉత్తేజితమగుచున్నట్లు, ఒక్క కురాను గ్రంథం ముసల్మానుల నందరిని ఏకం చేయుచున్నట్లు సకల హిందూజాతియు వేదముల పేరుతో ఏకసూత్రంపై నడువగలదు. ఈ రహస్యమును గుర్తించియే మహర్షి సమాజనియమములలో వేదపఠన పాఠనములు, శ్రవణశ్రావణములు ఆర్యులకందరికి పరమ (ముఖ్య) ధర్మమని (3వ. ని) విధించుట జరిగినది.

ఇట్లు ఆర్యసమాజం యొక్క నియమములనుబట్టియే దాని విశిష్టత

స్పష్టమగుచున్నది. సదా సత్యం గ్రహించుటకు, అసత్యం త్యజించుటకు సిద్ధపడుచు మరుగునపడిన వేదధర్మముల ప్రచారం చేయుటకు వేద మంత్రముల యాధారంతో స్థాపింపబడిన ఆర్యుల (ఉత్తముల) సమాజం ఇది. ఇతరమతములు, సంస్థలు వలె స్వార్థంతో ప్రత్యేక సిద్ధాంతముల ప్రచారం చేయుటకు వెలసిన సమాజం కాదు. కనుక వేములకు ఉన్న బలం, శక్తి, విశిష్టత దీనికిని ఉండక తప్పదు.

వేదధర్మముల ప్రచారం చేయుటకు స్థాపింపబడిన యీ సంఘమునకు మహర్షి యెంతో దూరదృష్టితో 'ఆర్యసమాజ' మని పేరు పెట్టినట్లు తోచు చున్నది.

వేదము మనుష్యులను రెండురకాలుగా పేర్కొన్నది. ఒకటి ఆర్యులు; రెండు అనార్యులు - దస్యులు. ఆర్యులు మంచివారు. దస్యులు చెడ్డవారు. కాన వేదము ననుసరించియే "ఆర్యసమాజ" మని పేరు పెట్టబడినది.

మరొక విశేషము - ఆంగ్లపరిపాలనములో ఈ దేశ (భారతదేశ) చరిత్రము తారుమారు చేయబడినది. ఈ దేశస్థులు ద్రావిడులని, ఆర్యులు పరాయిదేశములనుండి యీ దేశమునకు వలసవచ్చినవారని పేరులు పెట్టి, భారతీయులను ఇరుతెగలుగా విభజించి వైరము కల్పించి చరిత్ర సృష్టింప బడినది. ఇట్లు దేశస్థులలో అనైక్యత కల్పింపబడినది. ఈ మోసమును గుర్తించి, అసలు ఈ దేశనామము ఆర్యావర్తమని, ఇందలి జనులు ఆర్యులని, వీరిది వేదమతమని, వీరు ఎక్కడినుండియో వచ్చినవారుకారని మరల స్ఫురింప జేయుటకు, దేశముపైని భక్తి, వేదముల యెడ విశ్వాసము పునరుద్ధరించుటకు 'ఆర్యసమాజ' మని పేరు పెట్టబడినది.

ఆర్యశబ్దము ఏ యొక తెగకు సంబంధించినది కాదు. వేదధర్మముల పాటించువా రెవరును దీనిని వ్యతిరేకింప బనిలేదు.

ఈ అర్యసమాజమునకు పదినియమములు గలవు. సమాజసభ్యులు సాప్తాహికసత్సంగములలో ఆ నియమములను ఒకమాటు చదివి వినిపించుట ఆచారంగా వస్తూఉన్నది. కాని - 'అంతమాత్రంతో చాలదని, నియమముల లోని నిగూఢార్థముల వివరించి సభ్యులకు వినిపించినయెడల సమాజం

యొక్క విశిష్టత బోధపడగలదనియు' - నా కొకప్పుడు ఆలోచన కలిగినది. అంత నా పదినియమములను గురించి అధ్యయనం, మననం చేయదొడంగితిని, ఇతరులు ఆ నియమములపైని వ్రాసిన వ్యాఖ్యానగ్రంథములు ఒకటి రెండు తెలుగులో లభించినవి చదివితిని. కాని నా కేలనో మహర్షి దయానంద సరస్వతి వ్రాసిన గ్రంథములనుండియే యీ నియమములకు సంబంధించిన విషయములను సేకరించి వారి యభిప్రాయములతోనే వ్యాఖ్యానము చేసిన బాగుగా నుండునని స్ఫురించినది. కాని నా పరిస్థితులనుబట్టి ఆ ప్రయత్నమునకు తగిన వ్యవధిగాని వాఙ్మయముగాని అంతటా లభింపక పోయినా నాకు వీలయినంతవరకు ఆ ప్రయత్నమునే చేసితిని.

ఆర్యభాషలో వెలువడు వేదవాణి, జనజ్ఞాన్, ఆర్యమిత్ర - మొదలగు పత్రికలు ; వ్యవహారభానువు, స్వమంతవ్యామంతవ్యప్రకాశము - మొదలగు మహర్షి విరచిత లఘుగ్రంథములతోపాటు విశేషించి సత్యార్థప్రకాశము నా ప్రయత్నమునకు తోడ్పడినవి. నిత్యము నా యొనర్చు వేదభాగములయు, ఆధ్యాత్మిక గ్రంథములయు పరిశీలనము ఉండనే ఉన్నది. ఇట్లు శక్తికొలది మహర్షి హృదయమును కనుగొన ప్రయత్నించుచు పదినియమములకు వ్యాఖ్యానము రచించితిని. అయితే ఒకే ప్రయత్నంలో పది నియమములకు వ్యాఖ్యానం పూర్తిచేయుట జరుగలేదు. అప్పుడప్పుడు స్ఫురించిన విషయాలను చేర్చుకొనుచు అవకాశమును బట్టి పది నియమములకు వ్యాఖ్యానం పూర్తిచేసితిని. అందువల్ల సంగతికొరకు అటనట పునరుక్తులు దొరలి యుండవచ్చు. ఆధ్యాత్మిక విషయములందు పునరుక్తిని దోషముగా పెద్దలు పరిగణింపరు. కాన వానిని సవరించుటకు ప్రయత్నింపనైతి.

ప్రతినియమము మొదట అవతారికపేరుతో తరువాతి నియమమునకు గల సంగతి చెప్పబడుతూ ఉంటుంది.

ఈరచనలో మహర్షి దయానందసరస్వతియొక్క హృదయము, ఆర్యసమాజముయొక్క విశిష్టత యెంతవరకు వివరింపబడినవో పాఠకులే నిర్ణయింపగలరు.

పింగళ - దీపావళి<br>ది. 10-11-1977

ఇట్లు<br>- రచయిత

# విషయసూచిక

పుట సంఖ్య


మొదటి నియమము 1

సత్యవిద్యకు ఆశ్రయం పరమేశ్వరుడు (1) సత్యవిద్యకు ప్రేరకుడు పరమేశ్వరుడు (4) కార్యజగత్తుకు నిమిత్తకారణం పరమేశ్వరుడు (5) కార్యజగత్తుకు ఆధారం పరమేశ్వరుడు (6) ఈ నియమరచనకు ఆధారమగు మంత్రము (8) పరమేశ్వర పద నిర్వచనం (8) ముగింపు (9)

రెండవ నియమము 10

పరమేశ్వరుని స్వరూపము (10) ఇతరమతముల పరిశీలన (28) పరమేశ్వరునే ఉపాసింపవలెననుటకు ప్రమాణములు (31) ఉపాసనా పద్ధతి (32) ఉపాసనా భేదములు (32) ఉపాసనా ఫలము (32) ఈ నియమరచనకు ఆధారమగు మంత్రములు (33)

మూడవ నియమము 34

పూర్వగాథ (34) వేదసంఖ్యా విచారణ (37) వేదవ్యాస విషయము (38) వేదం ఈశ్వరీయం (39) వేదభాషయు ఈశ్వరీయం (40 ) వేదం జ్ఞానమయం (41) ఈ నియమరచనకు ఆధారమగు మంత్రం (44) వేద ప్రచారానికి సులభమార్గం (45) ఆర్యుల పరమ ధర్మం (45) ఒకే ధర్మ గ్రంథము (47) స్వాధ్యాయ ప్రవచనములు (48) స్వా. ప్ర. మానరాదనుటకు మరికొన్ని ప్రమాణములు (49 - 50)

నాలుగవ నియమము 51

నియమరచనకు ఆధారమగు మంత్రములు (51) సంఘ జీవనము (51) మిథ్యారోపణము (53) సత్యాసత్యముల యర్థవివరణ (55) రాజకీయ రంగమున సత్య నిర్ణయం (56) సత్యాసత్య నిర్ణయానికి చర్చలు (57) అయిదు విధముల పరీక్షా విధానము (58) సత్య మెవరినుండి యైన గ్రహించాలి (59)

అయిదవ నియమము 60

మూఢాచారములు (60) వైజ్ఞానికుల యభిప్రాయము (61) కర్మములు మూడు విధములు (63) విజ్ఞాన లక్షణము (64) ధర్మ లక్షణము (64) ధర్మం ఒక్కటిగానే ఉంటుంది (67) ధర్మాచరణకు ప్రమాణములు (69) ఈ నియమరచనకు ఆధారమగు మంత్రములు (70)

ఆఱవ నియమము 71

ఆర్యసమాజముయొక్క ఉద్దేశ్యము (71) ప్రపంచము (71) ఉపకారము (73) ఈ నియమరచనకు ఆధారమగు మంత్రము (75)

ఏడవ నియమము 76

ప్రేమ (76) ధర్మానుసారము (78) యథాయోగ్యము (78) ఈ నియమరచనకు ఆధారమగు మంత్రములు (79)

ఎనిమిదవ నియమము 80

విద్యావిద్యలు (80) అవిద్యా భేదములు (82) విద్యావ్యాప్తికి సాధనములు (82) విద్యావ్యాప్తికి ప్రమాణములు (83) ఈ నియమరచనకు ఆధారమగు మంత్రములు (84)

తొమ్మిదవ నియమము 85

సర్వ పదార్థములు గతిమంతములు (85) వ్యక్తి సమాజముల యున్నతి (86) స్వార్థంవలన అశాంతి (88) వ్యక్తి సమాజముల యున్నతిలో నేది ముఖ్యము (89) సమాజోన్నతి లేనందున నష్టము (91) ఈ నియమరచనకు ఆధారమగు మంత్రము (92)

పదియవ నియమము 93

వ్యక్తి - స్వాతంత్ర్యము (93) సమాజ ధర్మముల ప్రాముఖ్యత (94) యమ నియమములు (95) యమములు (96)

సింహావలోకనము 100

ఓ3మ్

# ఆర్యసమాజ నియమములు

## మొదటి నియమము

**"సబ్ సత్యవిద్యా ఔర్ జో పదార్థ విద్యాసే జానే జాతే హై ఉన్ సబ్‌కా ఆదిమూల్ పరమేశ్వర్ హై".**

తా॥ సమస్త సత్యవిద్యలకు విద్యవలన నెరుంగదగు సమస్త పదార్థములకు ఆదిమూలము పరమేశ్వరుడు.

**సత్యవిద్యకు ఆశ్రయం పరమేశ్వరుడు**

ఈ నియమాన్ని రెండు వాక్యాలుగా విడదీయవచ్చు. ఒకటి సమస్త సత్యవిద్యలకు ఆదిమూలము పరమేశ్వరుడు ; రెండు విద్యవలన నెరుంగదగు సమస్త పదార్థములకు ఆదిమూలము పరమేశ్వరుడు ; అని.

ఆధిమూలం అంటే ముఖ్యఆశ్రయం - ఆధారం ; లేదా మొదటి నిమిత్త కారణం - ప్రేరకకారణం ; అని గ్రహించాలి. సత్యం అంటే యథార్థం - నిర్భ్రాంతం - త్రికాలాబాధ్యం, అని యర్థం. విద్య అంటే జ్ఞానం - తెలివి.

జ్ఞానం ఒక గుణం. గుణం ఎప్పుడూ గుణిని అనగా ఒక ద్రవ్యాన్ని ఆశ్రయించి ఉంటుంది. కాని విడిగా ఉండదు. ఎట్లంటే - తీపి ఒక గుణం గదా! అది బెల్లం అనే గుణిని - ద్రవ్యాన్ని ఆశ్రయించి ఉంటుంది. బెల్లం అనే ద్రవ్యం నుండి తీపి అనే గుణాన్ని విడదీయలేము. ద్రవ్యం యొక్క సహజగుణం ద్రవ్యంతోపాటు ఉండి ద్రవ్యంతోపాటే నశిస్తుంది. లోకంలో గుణంలేని ద్రవ్యమంటూ ఉండదు. కాన ఇట ద్రవ్యగుణముల సంబంధం శాస్త్రభాషలో చెప్పాలంటే సమవాయసంబంధం అంటారు. అనగా విడదీయ రానిది.

అట్లే వేడి ఒక గుణం. అది అగ్నికి సహజగుణం. గంధం ఒక గుణం. అది పృథివికి సహజగుణం. కాన వేడిని అగ్నినుండిగాని గంధాన్ని పృథివి నుండి గాని విడదీయజాలం.

అందుచేత అనగా - గుణం ఒక ద్రవ్యాన్ని ఆశ్రయించియుంటుంది గనుక - జ్ఞానగుణంకూడ ఏదో యొక ద్రవ్యాన్ని ఆశ్రయించి ఉండక తప్పదు. అయితే ఆ ద్రవ్యం - వస్తువు - ఏది? అదియే పరమేశ్వరుడు. అతడే సత్య స్వరూపుడు; నిర్వికారుడు. కాన అతని గుణం జ్ఞానంకూడ సత్యంగానే ఉంటుంది. భ్రమ ప్రమాదాలకు (మార్పులకు) లోనుగానేరదు. అందువలన సమస్త సత్యవిద్యలకు - సత్యజ్ఞానములకు - ముఖ్య ఆశ్రయం పరమేశ్వరుడు అని యీ నియమంలో మొదటి వాక్యం చెప్పుచున్నది.

జ్ఞానగుణం చేతనులయిన జీవేశ్వరు లిద్దరికి ఉన్నది. కాని జీవుడు అల్పుడు ; అణుస్వరూపుడు. అనగా పరిమాణంలో చాల చిన్నవాడు. పరమేశ్వరుడో, అనంతుడు ; సర్వవ్యాపకుడు. అనగా పరిమాణంలో చాల పెద్దవాడు. ప్రపంచంలో అంతకంటె పెద్దవస్తువు మరొకటి లేనేలేదు. కాన జీవుని జ్ఞానగుణం అల్పము కాగా పరమేశ్వరుని జ్ఞానగుణం సర్వవ్యాపకమై సర్వజ్ఞముగా ఉంటుంది. మరియు ఇచ్ఛాప్రయత్నాది గుణములు గల జీవుడు ప్రకృతి బద్ధుడవుతూ ఉంటాడు. కాన ప్రాకృతిక శరీరం ధరించి కర్మ లాచరిస్తూ ఉంటాడు. కర్మఫలము లనుభవిస్తూ ఉంటాడు. ప్రకృతి కూడ సత్వరజస్తమోగుణాత్మకం. కనుక ప్రకృతిబద్ధుడైన జీవుని యొక్క జ్ఞానగుణం కూడ ఒకే తీరులో నిలకడగా ఉండదు. ప్రాకృతిక శరీరేంద్రియ సాధనములను బట్టి సత్వరజస్తమోగుణముల మూలకంగా హెచ్చుతూ తగ్గుతూ ఉండడమే గాక సదా నిర్భ్రాంతమును, నిస్సంశయమును గానేరదు. అనగా సత్యము - (మూడు కాలములలో ఒకే తీరుగా ఉండేది) కానేరదు.

ఇక పరమేశ్వరుడో ప్రకృతికి అతీతుడు. కాన ప్రకృతిబద్ధుడై శరీరధారణ చేయడంగాని కర్మ లాచరించడంగాని కర్మఫలము లనుభవించడంగాని జరుగదు. సర్వశక్తిమంతుడు గనుక నాతనికి సాధనాలతో పనియే లేదు. అఖండుడు; ఏకరసుడు కనుక సదా మూడుకాలాలలో ఒకే తీరుగ నాతనిజ్ఞానం ఉంటుంది. అందుకనియే సత్య విద్యలకు ఆశ్రయం పరమేశ్వరుడని చెప్పబడినది. సత్యమంటే మూడుకాలాలలో ఒకేతీరుగా ఉండేది. ఒకప్పుడుండి ఒకప్పుడు పోయేది కాదు: మారేది కాదు. అని చెప్పుకొన్నాము.

ఇట విద్య అనే పదానికి 'సత్య' అను విశేషణం కూడ వాడబడినది. కాని విద్య-అంటేనే యథార్థజ్ఞానం. ఎట్లన - విద్యాపదానికి మహర్షి వ్రాసిన వివరణ చూడండి; ఎట్లా ఉందో!

1. లోకంలో ఈశ్వరుడు మొదలుకొని పృథివిపర్యంతం ఉన్న పదార్థముల యొక్క జ్ఞానం సంపాదించి వానినుండి యథాయోగ్యంగా ప్రయోజనం పొందడమే విద్య యనబడుతుంది. (ఆర్యోద్దేశ్యరత్నమాల - 16)

2. పదార్థముల యథార్థస్వరూపం తెలుసుకొని న్యాయయుక్తకర్మల నాచరించుటయే విద్య. అట్లుగాక అనగా పదార్థముల యథార్థ స్వరూపం దెలియక అన్యాయయుక్త కర్మల నాచరించుట అవిద్య యనబడుతుంది. (వ్యవహారభాను)

3. దేనిచే పదార్థముల యథార్థస్వరూపం బోధపడుతుందో అది విద్య. దేనిచే తత్త్వస్వరూపం బోధపడదో అది యవిద్య యనబడుతుంది. (స.ప్ర. 9 సము.)

కాగా ఇప్పుడు సత్యవిద్య అంటే మూడుకాలాలలో ఏకరసంగా ఉండి హ్రాసవికాసములు - హానివృద్ధులు - లేని జ్ఞానమే అని పాఠకులు గ్రహించి ఉంటారు. ఈ దృష్టితో చూస్తే పరివర్తనశీలమగు (మార్పులు చెందుచుండే) మానవుని జ్ఞానం సత్యవిద్యాసంజ్ఞికం కానేరదు. అందువల్ల ఈశ్వరీయజ్ఞానమే సత్యవిద్యాసంజ్ఞికం అవుతుంది. అదియే వేదం పేరుతో చెప్పబడుతుంది. ఈ ఉద్దేశ్యంతోనే మూడవనియమంలో వేదము సమస్త సత్యవిద్యల గ్రంథము - అని చెప్పబడినది. కాగా వేదం ఈశ్వరీయ మన్నమాట.

అందువలన 'సమస్త సత్యవిద్యలకు ముఖ్య-ఆశ్రయం పరమేశ్వరుడు' అని చెప్పుకొన్నాం.

ఇట మరొక విషయం: ఏమంటే - జ్ఞానం జ్ఞేయానికి సంబంధించి ఉంటుంది. జ్ఞేయం లేకుండ జ్ఞానం కలుగదు. కాన సత్యవిద్యకు అనగా సత్యజ్ఞానానికి సత్యజ్ఞేయం ఉండాలి. ఆ పదార్థమే పరమేశ్వరుడు.

సత్యవిద్యకు ప్రేరకుడు పరమేశ్వరుడు

ఇక ఆదిమూలం అనగా ఆశ్రయం లేక ప్రేరకకారణం అని రెండర్థాలు చెప్పుకొన్నాం. జ్ఞానం గుణంకావడంవల్ల గుణియైన పరమేశ్వరుని ఆశ్రయించి ఉన్నట్లు చెప్పుకొన్నాం. అందుచేత మొదటియర్థం సరిపోయింది. ఇక రెండవ యర్థం ప్రేరకకారణం - ఎట్లవుతుందో వివరింపవలసియుంది.

సమస్త సత్యవిద్యలకు ఆదిమూలం - ప్రేరకకారణం పరమేశ్వరుడు అని గదా అన్వయము! చూడండి: ప్రపంచమునకు మూలభూతములయిన జీవేశ్వర ప్రకృతులు మూడు నిత్య సత్యములయిన పదార్థములు. అనగా ఎల్లప్పుడు ఉండేవి. వానిలో ప్రకృతి సూక్ష్మము. ఇంద్రియములకు గోచరము కానిది. అందుకనే దానిని అవ్యక్తమనియు అంటారు. జీవుడో సూక్ష్మతరము. అనగా ప్రకృతికంటె సూక్ష్మమైనవా డన్నమాట. ఇక పరమేశ్వరుడు సూక్ష్మతమము. అనగా ప్రకృతిజీవులకంటె కూడ మిక్కిలి సూక్ష్మమైనవాడు. సూక్ష్మమైనది స్థూలమైనదానిలో ప్రవేశింపగలదు. కాని స్థూలమయినది సూక్ష్మమైనదానిలో ప్రవేశింపజాలదు. ఎట్లన : పార్థివమైన ఇనుపగుండు స్థూలము. అగ్ని దానికంటె సూక్ష్మము. కాన వేడిచేసినప్పుడు అగ్ని దానిలో ప్రవేశింపగలదు. కాని స్థూలమయిన ఇనుము అగ్నిలో ప్రవేశింపజాలదు. కాబట్టి సూక్ష్మతమమైన పరమేశ్వరుడు సూక్ష్మసూక్ష్మతరము లయిన ప్రకృతిజీవులలో గూడ వ్యాపించి ఉంటాడు. అందుకనే పరమేశ్వరుని సర్వాంతర్యామి యని చెప్పుతుంటారు. సర్వాంతర్యామి, సర్వవ్యాపకుడు అయిన పరమేశ్వరునియొక్క జ్ఞానగుణం కూడ అంతర్బహిశ్చ వ్యాపించి సర్వవ్యాపకంగానే ఉంటుంది. కాన జీవునిలో కూడ నంతర్యామియై పరమేశ్వరుడు సత్యజ్ఞానమునకు ప్రేరకుడవుతూ ఉంటాడు.

ఎట్లని సందేహమా! చూడండి : "ఆత్మ మనస్సును, మనస్సు ఇంద్రియములను ఏదేని విషయమందు లగ్నం చేసినప్పుడూ; దొంగతనం మొదలయిన చెడ్డపనులు గాని పరోపకారం మొదలైన మంచిపనులనుగాని చేయదొడగిన క్షణంలోను జీవుని యిచ్ఛాజ్ఞానాదులు ఆ వాంఛితవిషయాలలో వాలుతూ ఉంటవి. అప్పుడు ఆత్మలో చెడ్డపనులు చేయడానికి భయం, శంక,

లజ్జయు; మంచిపనులు చేయడానికి నిర్భయత, నిశ్శంకత, ఆనందోత్సాహాలు కలుగుతూ ఉంటవి. అవి యెక్కడినుండి కలుగుతున్నవి? జీవాత్మనుండియా? కాదు. అవి పరమాత్మనుండియే కలుగుతున్నవి." (స.ప్ర. సప్తమ. సము)

అందువల్ల సమస్త సత్యవిద్యలకు ఆదిమూలం - అనగా ప్రేరకకారణం- పరమేశ్వరుడని యర్థం చెప్పుకొన్నాం.

**కార్యజగత్తుకు నిమిత్తకారణం పరమేశ్వరుడు**

ఇక ఈ నియమంలో రెండవ వాక్యం

"విద్యవలన నెరుంగదగు సమస్త పదార్థములకు ఆదిమూలము పరమేశ్వరుడు."

లోకంలో సూర్యుడు మొదలుకొని పృథివిపర్యంతం స్థూల సూక్ష్మ (వ్యక్తావ్యక్త) పదార్థములు అనేకం ఉన్నవి. వాని కన్నింటికి ఈశ్వరుడు ఆది మూలం. అనగా ఆధారం లేక నిమిత్తకారణం.

ఎట్లనగా - సత్వరజస్తమోగుణముల సామ్యావస్థకు ప్రకృతి యని పేరు. అందలి గుణముల సామ్యావస్థను పోగొట్టి వానియందు విషమావస్థను కల్పించువాడు ఈశ్వరుడు. అనగా కారణకార్యక్రమమున ప్రకృతి పరిణమించడానికి ఆదిభూతమగు ప్రథమ సంచలనమునకు కర్త - చేతన నిమిత్తకారణం - పరమేశ్వరుడు. ప్రకృతి పరిణమించు స్వభావం గలది; జడము. అది భూతభౌతిక జగత్తునకు ఉపాదానకారణం కాగా పరమేశ్వరుడో చేతననిమిత్తకారణం - కర్త - అవుతున్నాడు. ఎట్లంటే :

కుండ తయారు చేయడానికి మట్టి ఉపాదానకారణం అవుతుంది. కుమ్మరివాడు చేతననిమిత్తకారణం అవుతున్నాడు. అట్లే నగలు చేయడానికి బంగారం ఉపాదానకారణం కాగా స్వర్ణకారుడు చేతననిమిత్తకారణం - కర్త - అవుతున్నాడు. ఆ విధంగానే భూతభౌతిక ప్రపంచపదార్థముల సృష్టికి ప్రకృతి ఉపాదానకారణం కాగా పరమేశ్వరుడు చేతన నిమిత్తకారణం - కర్త - అవుతున్నాడు.

ప్రకృతి పరిణమించు స్వభావం కలదియైనా జడం కనుక స్వయంగా పరిణమింపజాలదు. చేతననిమిత్తకారణం వల్ల అయ్యది పరిణమిస్తుంది. ఎట్లన : జడమైన మట్టి స్వయంగా కుండరూపంలో మారజాలదు. చేతన

నిమిత్తకారణం - కర్త - యైన కుమ్మరి దానిని కుండగా మారుస్తాడు. అట్లే జడమైన ప్రకృతిని చేతననిమిత్తకారణం - కర్త - అయిన పరమేశ్వరుడు భూతభౌతిక ప్రపంచంగా మారుస్తాడు. ఆ మార్పు క్రమం ఎట్లనగా :

పరమేశ్వరుని ప్రేరణచే ప్రకృతినుండి మహత్తత్వ మను బుద్ధి; దానినుండి అహంకారము; దానినుండి పంచతన్మాత్ర లను సూక్ష్మభూతములు, పది యింద్రియములు, పదునొకండవమనస్సు; ఆ పంచతన్మాత్రలనుండి పృథివ్యాది పంచమహాభూతములు - అను నిరువదినాలుగు తత్త్వములు, భౌతిక పదార్థములును ఏర్పడును. (స.ప్ర. అష్ట. సము.)

అయితే యిట కార్యావస్థయందున్న పదార్థము లన్నియు వికృతులు. అందువల్ల అవి వినశ్వరములు. అనగా నశించేవి. కాని వీనికి ఆదిమూల మయిన ప్రకృతిమాత్రం అసత్ కానేరదు - నశింపదు.

ఇట్లు కారణావస్థయందు గాని కార్యావస్థయందు గాని ఉండు ప్రాకృతిక పదార్థముల కన్నింటికి (మట్టిపాత్రలకు కుమ్మరివలె, బంగారునగలకు స్వర్ణకారుడువలె) ఆదిమూలం అనగా చేతననిమిత్తకారణం - కర్త - పరమేశ్వరుడు అవుతున్నాడు.

**కార్యజగత్తుకు ఆధారం పరమేశ్వరుడు**

ఇట్టీ పదార్థముల సృష్టికి నిమిత్తకారణమే కాదు; ఆధారం కూడ నగుచున్నాడు పరమేశ్వరుడు. ఎట్లనగా - జగత్తులోని పదార్థము లన్నియు నియమబద్ధముగా చలించు-కదులు-చున్నవి. కాన నియమబద్ధమగు చలనము గల ఈ పదార్థములకు చలించని పదార్థమేదో ఆధారంగా ఉండాలి. ఎందుకంటె- బండిచక్రం తిరుగుతూ ఉంటుంది. పడిపోకుండ దానికి తిరుగని ఇరుసు ఆధారంగా ఉంటుంది. లేకున్న నది పడిపోతుంది. అట్లే ఊయెల ఊగుతుంటుంది. దానికి కదలని దూలం ఆధారంగా ఉంటుంది. పొగబండి పరుగిడుతుంటుంది. దానికి పట్టాలు ఆధారంగా ఉంటవి. అట్లే చలించుచున్న ప్రపంచపదార్థములకు చలింపనట్టి-అచలమైన-పదార్థమేదో ఆధారంగా ఉండాలి. అదియే పరమేశ్వరుడు. పరమేశ్వరుడు అచలుడని వేదం కూడా వర్ణించుచున్నది.

అంతేగాదు. "సత్యేనోత్తభితా భూమిః" - పృథివ్యాది సమస్త పదార్థములకు ఆశ్రయం సత్యస్వరూపుడగు పరమేశ్వరుడు ; అని వేదం వర్ణించుచున్నది. "సన్మూలాః సోమ్యేమాః ప్రజాః సదాయతనాః సత్ప్రతిష్ఠాః" - అని ఉపనిషత్తులలో కూడ 'సత్పదార్థమునకు అసత్పదార్థములకు ఆధారం ఆయతనం - ప్రతిష్ఠ - బ్రహ్మ' యని చెప్పబడినది.

కాబట్టి సదసత్పదార్థముల కన్నింటికి ఆదిమూలం అనగా ఆధారం-పరమేశ్వరుడు అన్నాము.

సృష్టికి కర్త, ఆధారము పరమేశ్వరుడనుటకు ప్రమాణములు :

1. **"యతో వా ఇమాని భూతాని జాయంతే**
**యేన జాతాని జీవంతి యత్ప్రయంత్యభి -**
**సంవిశంతి తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మ." (తై. ఉ.భృ. 8 .1)**

'ఏ పరమాత్మరచనచేత ఈ సమస్త పృథివ్యాది భూతము లుత్పన్నము లగుచున్నవో, ఎవనిచే జీవనమును, ఎవనియందు ప్రలయమును పొందు చున్నవో అతడే బ్రహ్మము. అతనిని దెలియుటకు నిచ్ఛగింపుము."

2. "జన్మా ద్యస్య యతః" (బ్ర. సూ. 1-1-2)

'ఎవనిచే నీ జగదుత్పత్తి స్థితి ప్రలయము లగుచున్నవో ఆ బ్రహ్మయే తెలిసికొనదగినవాడు.'

ఇట్లు సృష్టికి కర్త, ధర్త పరమేశ్వరు డనడానికి శ్రుతి స్మృతి ప్రమాణము లనేకం గలవు.

అందువల్ల - అనగా పదార్థములసృష్టికి నిమిత్తకారణం, పదార్థముల యునికికి ఆధారం పరమేశ్వరుడు అగుటవల్ల - నియమంలోని ఆదిమూలం అనుపదానికి ఆధారం లేక నిమిత్తకారణం అని రెండువిధాలుగా అర్థం చెప్పుకొన్నాం. కాగా కార్యజగత్తునకు పరమేశ్వరుడు ఆదిమూలం అని తేలుతుంది.

ఇప్పుడు నియమంలోని రెండు భాగాలను - వాక్యాలను - కలిపి చదవండి.

'సమస్త సత్యవిద్యలకు విద్యవలన నెరుంగదగు సమస్త పదార్థములకు' - అనగా సంపూర్ణజ్ఞానానికి జ్ఞానంవల్ల తెలియబడే సమస్త జ్ఞేయపదార్థాలకు - ఆదిమూలం పరమేశ్వరుడు అని తేలుతుంది.

కాగా - సమస్త సత్యవిద్యలగ్రంథం వేదం కనుక అట్టివేదానికి, కార్యజగత్తునకు నిమిత్తకారణం పరమేశ్వరుడని బోధపడుతుంది.

ఈ అర్థం సూచించు ఋఙ్మంత్రం ఒకటి గలదు చూడండి ;

ఈ నియమరచనకు ఆధారమగు మంత్రము

"ఋతం చ సత్యం చాభీద్ధా త్తపసోऽధ్యజాయత" (1-190-1.)

ఈశ్వరునియొక్క (అభీద్ధా త్తపసః) అనంతసామర్థ్యమువలన (ఋతం) సమస్త సత్యవిద్యల కాకరమగు వేదశాస్త్రములు ప్రకాశించినవి. (సత్యం) సత్వరజస్తమోగుణాత్మకమగు అవ్యక్తము - ప్రకృతి (అధ్యజాయత) కార్య రూపమున ఉత్పన్నమైనది.

ఈ మంత్రంయొక్క ఆధారంతో మహర్షి యీ మొదటినియమాన్ని రచించారు. ఈ మంత్ర మొక్కటే గాదు, ఇంతకు పూర్వం ఉదాహరించిన మరికొన్ని యీ అర్థంగల మంత్రాలు ఆధారంగా తీసుకొని మహర్షి యీ నియమం రచించారు.

పరమేశ్వరపద నిర్వచనం

ఇక పరమేశ్వరపదానికి అర్థం వివరిస్తేకాని యీ మొదటి నియమ వ్యాఖ్యానం పూర్తికాదు.

" య ఈశ్వరేషు సమర్థేషు పరమః శ్రేష్ఠః స పరమేశ్వరః"

సామర్థ్యవంతున కీశ్వరుడని పేరు. ఈశ్వరులలో ననగా సమర్థులలో సమర్థుడై తనతో సమాను డెవడును లేనివానికి పరమేశ్వరు డని పేరు.

(స.ప్ర. ప్రథమ సము.)

గుణకర్మ స్వభావములందును, సత్యవ్యవహారములందును అందరి కంటె నధికుని శ్రేష్ఠు డందురు. అట్టి శ్రేష్ఠులందరిలో నత్యంత శ్రేష్ఠుడు పరమేశ్వరుడనబడును. అతనితో సమాను డెవడును కాలేదు; లేడు; కాబోడు. సమానుడే లేనపుడు అధికు డెట్లుండగలడు? (స.ప్ర. ప్రథ. సము.)

ఇవి మహర్షి దయానందసరస్వతి 'సత్యార్థప్రకాశంలో పరమేశ్వర పదాన్ని వివరిస్తూ వ్రాసిన మాటలు. ఈ మాటల కర్థం స్పష్టమే. కాన అద్వితీయమై, సర్వశక్తిమంతమై సృష్టి స్థితిలయములకు కర్తయగు పదార్థమే పరమేశ్వరుడని బోధపడుతుంది.

ముగింపు

ఇక ఈ మొదటినియమాన్ని పాలించాలంటే పదార్థముల కార్యకారణ భావమును చింతన చేయాలి. ఈ జగత్తున కాదిమూలం పరమేశ్వరుడని భావించాలి. మూలమునకు మూలం ఉండదు గనుక పరమేశ్వరునకు మరియొక మూలం ఉండదని గ్రహించాలి.

ఇట్లు మొదటి నియమంలోనే ఆర్యసమాజం సృష్టిలయకారకుడైన పరమేశ్వరునియొక్క అస్తిత్వాన్ని అంగీకరించుటచే ఈశ్వరప్రణిధానంగల ఆస్తికసమాజంగా నిది కనబడుతుంది. కాబట్టి ఆర్యసమాజం ఆస్తికసమాజమా? లేక నాస్తిక సమాజమా? అని సందేహింపవలసిన పనియే లేదు.

"అస్తి ఇతి మతి ర్యస్య సః ఆస్తికః" పరలోకము, ఈశ్వరుడు ఉన్నట్లు అంగీకరించువాడు - నమ్మువాడు ఆస్తికుడని చెప్పబడును. అట్టి ఆస్తికులయొక్క సమాజం ఆస్తిక సమాజం. కాన ఆర్యసమాజం ఆస్తిక సమాజం అనడంలో సందేహంలేదు.

ఈ మొదటి నియమంవల్ల ఆర్యసమాజంయొక్క మౌలిక సిద్ధాంతాలు రెండు వ్యక్తమౌతూ ఉన్నవి. ఒకటి వేదం అపౌరుషేయం - ఈశ్వరీయం - అని: రెండు పరమేశ్వరుడు కార్యజగత్తునకు నిమిత్తకారణం అని, అంతేగాదు, కారణరూపంలో జగత్తు సత్యం అనియు ఇందు గర్భితమై ఉన్నది.

అందువల్ల కేవల చేతనవాదం (అద్వైతం) గాని, కేవల భౌతిక (జడ) వాదం గాని ఖండితము లవుతున్నవి.

## రెండవ నియమము

అవ॥ జ్ఞానజ్ఞేయములకు ఆదిమూలము పరమేశ్వరుడని మొదటి నియమంలో చెప్పబడినది. అందువలన పరమేశ్వరు డంటే ఎవరు? ఆయన గుణ కర్మ స్వభావము లేమి; అను ఆకాంక్ష కలుగుతుంది. దానికి సమాధానమే ఈ రెండవ నియమం.

నియమము

"ఈశ్వర్ సచ్చిదానందస్వరూప్, నిరాకార్, సర్వశక్తిమాన్, న్యాయకారీ, దయాలు, అజన్మా ,అనంత్, నిర్వికార్, అనాది, అనుపమ్, సర్వాధార్, సర్వేశ్వర్, సర్వవ్యాపక్, సర్వాంతర్యామీ, అజర్, అమర్, అభయ్, నిత్య, పవిత్ర, ఔర్ సృష్టికర్తా హై ; ఉసీకీ ఉపాసనా కర్నీ యోగ్య హై."

తా॥ ఈశ్వరుడు సచ్చిదానందస్వరూపుడు, నిరాకారుడు, సర్వశక్తి మంతుడు, న్యాయకారి, దయాలుడు, అజన్ముడు, అనంతుడు, నిర్వికారుడు, అనాది, అనుపముడు, సర్వాధారుడు, సర్వేశ్వరుడు, సర్వవ్యాపకుడు, సర్వాంతర్యామి, అజరుడు, అమరుడు, అభయుడు, నిత్యుడు, పవిత్రుడు, సృష్టికర్తయునై యున్నాడు. అతనినే ఉపాసించుట యోగ్యము.

పరమేశ్వరుని స్వరూపము

ప్రపంచంలో అవైదికములయిన ఆస్తికమతములు - సంప్రదాయములు - అనేకం ఉన్నవి. ఆయా మతగ్రంథాలలో భగవంతుని స్వరూప వర్ణన కన్పిస్తుంది. కాని వాటిలో ఏకరూపత లేదు. తలకొకతీరుగా భగవంతునికి రూపకల్పన చేసినట్లు తోస్తుంది. జిజ్ఞాసువు ఎవడైనా మతమతాంతరముల ద్వారా ప్రతిపాదింపబడిన భగవంతుని గురించి తెలుసుకోడానికి ప్రయత్నిస్తే యథార్థమగు భగవంతుని స్వరూపమేదో తెలియక తికమకపడడం జరుగుతుంది. ఎందుకంటే - ఒకరు ఈశ్వరు డొక్కడే అని చెప్పుతుంటే, మరొకరు అనేకేశ్వరుల నంగీకరిస్తున్నారు. ఒకరు సర్వవ్యాపకు డీశ్వరు డంటే, మరొకరు కొండొక స్థానవిశేషంలో ఉన్నట్లు చెప్పుతున్నారు. ఒకరు నిరాకారుడంటే, మరొకరు సాకారునిగ వర్ణిస్తున్నారు. ఒకరు నిర్గుణుడంటే, మరొకరు సగుణుడంటున్నారు. ఇటు పలువురు పలురకాల చెప్పుతున్నారు. ఈ స్థితిలో నిజమయిన ఈశ్వరు

డెవరో, కానివా డెవరో తెలియక సాధారణ వ్యక్తి తికమక పడవలసి వస్తుంది.

మహర్షి దయానందసరస్వతి ఆర్యుల ధర్మగ్రంథమైన వేదం యొక్క ఆధారంతో ఈశ్వరుని వాస్తవిక స్వరూపాన్ని ఆర్యసమాజంయొక్క యీ రెండవ నియమంలో వర్ణించడం జరిగింది. జ్ఞానజ్ఞేయములకు ఆధారం, నిమిత్తకారణం పరమేశ్వరుడని మొదటి నియమంలో తెలుపబడింది. పరమేశ్వరుడు పూర్ణుడు గనుక అతని జ్ఞానమైన వేదంకూడ పూర్ణంగానే సర్వజ్ఞంగానే ఉంటుంది. అందువలన వేదంయొక్క ఆధారంతో నిశ్చయింపబడిన ఈశ్వరునియొక్క స్వరూపం వాస్తవికంగానే ఉంటుంది. దానిలో భ్రమప్రమాదా లుండవు.

మహర్షి ఈశ్వరుని స్వరూపం నిరూపించడానికి వేదప్రతిపాదితము లయిన గుణాలలో అనగా గుణబోధక విశేషణాలలో కొన్నింటిని స్వీకరించారు. అవియు నొకక్రమంలో కూర్చబడినవి. ఆక్రమంలో ఉన్న విశిష్టత, సంగతి ముందు వివరింపబడుతుంది. ఇంకను ఈ రెండవ నియమం వల్ల అద్వైతవాదం, అనేకేశ్వరవాదం, అవతారవాదం, మూర్తిపూజ మొదలయిన అవైదిక విషయాలు స్వయంగా ఖండితము లవుతున్నవి. ఈ విషయాలుకూడ మున్ముందు వివరింప బడుతవి.

మొట్టమొదట ఈ నియమంలో చెప్పబడిన ఈశ్వర గుణబోధక విశేషణములను వరుసగ పరిశీలింతము.

**1. ఈశ్వరుడు**

'ఈశ ఐశ్వర్యే' అను ధాతువునుండి ఈశ్వరశబ్దము సిద్ధమగు చున్నది. (య ఈష్టే సర్వైశ్వర్యవాన్ వర్తతే స ఈశ్వరః) అతనికి సత్యవిచారశీల జ్ఞానమును, అనంతైశ్వర్యమును గలదు. కనుక నా పరమాత్మకు 'ఈశ్వరుడు' అని పేరు. (స. ప్ర. ప్రథ. సము.)

పరమేశ్వరుడు జీవులకొఱకు ప్రపంచ పదార్థములను సృష్టించెనని 'యాథాతథ్యతోzర్థాన్ వ్యదధాత్ శాశ్వతీభ్యః సమాభ్యః' - అను యజుర్వేదమంత్ర భాగం (40-8) చెప్పుతున్నది. కాన ప్రపంచమంతయు నాతని యైశ్వర్యమే అవుతుంది. ఇంకను సృష్టికర్తయగు నీశ్వరునికి సృష్టించు జ్ఞానముతో పాటు పోషించుజ్ఞానము, లయముచేయు జ్ఞానముకూడ ఉంటుంది. కాబట్టి

అనంతైశ్వర్యము, జ్ఞానము కలవాడను నర్థమున ఈశ్వరనామము సార్థకమే యగుచున్నది.

2. సచ్చిదానంద స్వరూపుడు

సత్:- 'అస భువి' అను ధాతువునుండి సత్ శబ్ద మేర్పడుచున్నది. (యదస్తి త్రిషు కాలేషు న బాధ్యతే త త్సత్ - బ్రహ్మ) ఎల్లప్పుడు నుండువాడు భూతభవిష్యద్వర్తమాన కాలములచే బాధింపబడడు - కాబట్టి పరమేశ్వరుడు సత్తు - సత్స్వరూపుడు - అనబడును.

చిత్:- 'చితీ సంజ్ఞానే' అను ధాతువునుండి చిత్ శబ్ద మేర్పడుచున్నది. (యశ్చేతతి చేతయతి సంజ్ఞాపయతి సర్వాన్ సజ్జనాన్ యోగినస్తచ్చిత్ - పరం బ్రహ్మ) చైతన్యస్వరూపుడై సమస్తజీవులను తెల్వితో గూర్చి సత్యాసత్యములను దెలుపువా డగుటచే పరమేశ్వరుడు చిత్తు - చిత్స్వరూపుడు - అనబడును.

ఆనంద :- 'టు నది సమృద్ధౌ' అను ఆఙ్ పూర్వకమగు నది ధాతువు నుండి ఆనందశబ్ద మేర్పడుచున్నది. (ఆనందంతి సర్వే ముక్తా యస్మిన్, యద్వా యః సర్వాన్ జీవా నానందయతి స ఆనందః) ఆనంద స్వరూపుం డగుటచేత, సమస్తముక్తజీవులు నతనియం దానందించుటచేత, ధర్మాత్ములగు జీవుల నందఱ నానందయుక్తులుగ జేయుటచేత పరమేశ్వరు డానందు డనబడును.

ఈ మూడు (సత్+చిత్+ఆనంద) విశేషణములు కలవాడగుటచే పరమేశ్వరుడు సచ్చిదానంద స్వరూపుడు అనబడును. (స. ప్ర. ప్రథ. సము.)

ఇట పరమేశ్వరుడు సత్ స్వరూపుడని కాని, సచ్చిత్ స్వరూపుడని కాని చెప్పబడలేదు. సచ్చిదానందస్వరూపుడని చెప్పబడినది. ఏలయన : సత్ స్వరూపు డన్నచో జీవప్రకృతులు కూడ సత్ స్వరూపులే కనుక (త్రికాలా బాధ్యములే కనుక) గ్రహింపబడును. అందువలన లక్షణములో అతివ్యాప్తి దోషము కలుగును. కాన సత్‌స్వరూపుడని చెప్పబడలేదు. పోనీ! సచ్చిత్ స్వరూపుడని చెప్పుదమన్న జీవుడుకూడ సచ్చిత్ స్వరూపుడే యగును. కనుక నిప్పుడును లక్షణములో అతివ్యాప్తి దోషము తప్పదు. అందువలన సచ్చిత్స్వ రూపుడని చెప్పబడలేదు. సచ్చిదానందస్వరూపుడని చెప్పబడినది. సత్, చిత్

(జ్ఞానము) లక్షణములు జీవునిలో నున్నను ఆనందము జీవునిలో లేదు.

కాగా ప్రకృతి సత్స్వరూపిణి యని, జీవుడు సత్ చిత్ స్వరూపుడని, పరమాత్మ సత్ చిత్ ఆనందస్వరూపు డనియు తెలియుచున్నది.

ఇట్లు సత్ చిత్ ఆనంద - మూడు గుణములను కలిపి పరమేశ్వరునకు 'సచ్చిదానందస్వరూపుడు' అను సమానపదముతో స్వరూపలక్షణము చెప్ప బడినది. స్వరూప లక్షణము వేరు. తటస్థలక్షణము వేరు. సృష్టికర్త యనునది తటస్థలక్షణమునకు ఉదాహరణము.

దీనినిబట్టి నిత్యములయిన మూడు పదార్థములు - ఈశ్వర, జీవ, ప్రకృతులు ఉన్నవని తెలియుచున్నది. ఈ త్రిత్వవాదమువలన అద్వైతవాదము ఖండితమవుతున్నది.

అవ॥ లోకంలో ప్రాకృతిక పదార్థములకు ఆకారం కనబడుతున్నది. జీవుడుకూడ ప్రాకృతికశరీరం ధరించి కనబడుతున్నాడు. అట్లే పరమేశ్వరునికి కూడ ఆకారం ఉండితీరవలయు నను జిజ్ఞాస కలుగవచ్చును. అదియును గాక 'సచ్చిదానందస్వరూప' విశేషణములోని స్వరూపపదమునకు లక్షణమను నర్థము గ్రహింపక ఆకార మను నర్థము గ్రహించుచో పరమేశ్వరునకు కూడ ఆకార మున్నదను భ్రాంతియు కలుగవచ్చును. కనుక దీని నివారణార్థము నిరాకారు డను విశేషణము తరువాత వరుసలో మూడవదిగ చెప్పబడినది.

**3. నిరాకారుడు**

నిర్, ఆఙ్ - పూర్వకమగు 'డుకృఞ్ కరణే' అను ధాతువువలన నిరాకార శబ్ద మేర్పడుచున్నది. (నిర్గత ఆకారా త్స నిరాకారః) అతనికి ఏ యాకారము లేదు. అత దెన్నడును శరీరమును ధరింపడు. కాబట్టి ఈశ్వరుడు నిరాకారుడు. (స.ప్ర.ప్రథ. సము.)

ప్రశ్న : **"యదా యదా హి ధర్మస్యగ్లాని ర్భవతి భారత ।**
**అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్ ॥ "**

ఎప్పుడెప్పుడు ధర్మమునకు లోపము కలుగునో అప్పుడప్పుడు నేను శరీరమును ధరించుచున్నాడ నని శ్రీకృష్ణులు చెప్పియున్నారే? దీనికి మీరేమి చెప్పగలరు.

ఉత్త:- ఇది వేదవిరుద్ధమగుటచే ప్రమాణము కాదు. శ్రీకృష్ణుడు ధర్మాత్ముడు. ధర్మమును రక్షింపగోరుచుండెను. కాబట్టి యుగయుగమందును నేను జన్మమెత్తి శ్రేష్ఠులను రక్షించి దుష్టులను నాశనము చేసెదను - అని చెప్పుటవలన దోషమేమియు లేదు. ఏలయనగా (పరోపకారాయ సతాం విభూతయః) సత్పురుషుల సర్వస్వము పరోపకారము కొఱకే వినియోగమగు చున్నది. అయినను దీనిచే శ్రీకృష్ణుడు ఈశ్వరుడు కాజాలడు.

ప్రశ్న: అట్లయ్యేనేని ప్రపంచమందు ఈశ్వరున కిరువదినాలుగు అవతారములని యేల నమ్ముచున్నారు?

ఉత్త: వేదార్థము దెలియకుండుటచేతను, సాంప్రదాయకులు భ్రమింప జేయుటచేతను, తాము అవిద్వాంసు లగుటచేతను భ్రమజాలమందు చిక్కుకొని యిట్టి యప్రామాణికములగు వానిని చెప్పుచును, నమ్ముచును ఉన్నారు.

ప్రశ్న : పరమేశ్వరుడు నిరాకారుడేని వేదవిద్యోపదేశమందు ముఖము లేక వర్ణోచ్చారణ యెట్లు కలుగును? ఏలయనగా వర్ణములు నుచ్చరించుటకు తాల్వాది స్థానములును, జిహ్వాప్రయత్నము నవశ్యము కావలయును గదా!

ఉత్త : పరమేశ్వరుడు సర్వశక్తిమంతుడును, సర్వవ్యాపకుడును గావున తన వ్యాప్తిచే జీవులకు వేదవిద్యను ఉపదేశించుటకు అతనికి ముఖాదు లక్కర లేదు. ఏలయనగా ముఖజిహ్వలచేత వర్ణోచ్చారణ తనకంటె భిన్నులకు బోధపడుటకు చేయబడును. తనకొఱకుగాదు. చూడుడు : ముఖజిహ్వల వ్యాపారము లేకయే మనస్సునం దనేక వ్యవహారముల యాలోచనమును, శబ్దోచ్చారణయు నగుచుండును. చెవులను వ్రేళ్ళతో మూసికొని ముఖ జిహ్వా తాల్వాది స్థానములు లేకయే యెట్టి శబ్దములు కలుగుచున్నవో వినుడు. అట్లే పరమేశ్వరుడును జీవులకు నంతర్యామిరూపముచే నుపదేశించెను. ఉచ్చారణ కేవల మితరులకు దెలుపుటకే యవసరము. పరమేశ్వరుడు నిరాకారుడు, సర్వవ్యాపకుడు నగుటవలన దన యఖిలవేదవిద్యను జీవస్థస్వరూపముచే జీవాత్మయందు బ్రకాశింపజేయుచున్నాడు. పిమ్మట నా మనుష్యుడు తన ముఖముచే నుచ్చరించి యితరులకు వినిపించును. కాబట్టి ఈశ్వరునియం దీ దోషము రాజాలదు ( స. ప్ర. సప్త. సము.)

ప్రశ్న : పరమేశ్వరుడు నిరాకారుడు గదా! అతడు ధ్యానములోనికి రానేరడు. కాన విగ్రహ మవశ్యముగా నుండవలయును. ఏమియు చేయలేని వారైనను దాని సమీపమునకు బోయి మ్రొక్కి పరమేశ్వరుని నామస్మరణాది స్తోత్రములు చేయుగలుగుదురు. దీనివలన నష్టమేమి ?

ఉత్త : పరమేశ్వరుడు నిరాకారుడును, సర్వవ్యాపకుడును అగుటవలన అతనికి విగ్రహమే నిర్మింపబడనేరదు. విగ్రమును జూచినమాత్రమున పరమేశ్వరుడు స్మరణకు వచ్చునన్న నా పరమేశ్వరుడు పృథివి, జలము, అగ్ని, వాయువు, వనస్పతి మొదలుగాగల పదార్థములు నిర్మించి తన యద్భుత రచనావిశేషమును గనబఱచియున్నాడు గద! ఏమి? మనుష్య లేపర్వతాదుల నుండి విగ్రహములు మున్నగువానిని జేయగలుగుదురో యట్టి పృథివీపర్వతాది పరమేశ్వర రచిత మహామూర్తులను జూచినపుడు వారికి పరమేశ్వరుడు స్మరణకు రానేరడా? మూర్తిని జూచినమాత్రమున పరమేశ్వరుడు స్మరణకు వచ్చుననెడు మీమాట సర్వథా యబద్ధము. విగ్రహమెదుట లేకున్నపుడు పరమేశ్వరస్మరణ కలుగకపోవుటవలన మనుష్యడొంటరిగా దొంగతనము, వ్యభిచారము మొదలగు దుష్కర్మములు చేయుటయందు ప్రవృత్తుడగును. ఏలయనగా నీ సమయమున తన్నెవ్వరు చూడరనియే వాడు తలంచుచున్నాడు. కావున వా డనర్థకములను జేయక మానడు. ఇట్టి వనేక దోషములు ఈ విగ్రహారాధనమువలన కలుగుచున్నవి. ఇక పాషాణాదిమూర్తులను నమ్మక యెల్లప్పుడు సర్వవ్యాపకుడు, సర్వాంతర్యామియు, న్యాయకారియు నగు నా పరమాత్ముడు అంతట నున్నాడని గుర్తెఱుగుచు, నమ్ముచు నున్న పురుషుడు అందఱి మంచిచెడు కర్మములను సర్వజ్ఞుడగు పరమేశ్వరుడు చూచుచున్నా డనియు క్షణమాత్రముకూడ నతడు తన్ను వదలి యుండడనియు భావించి, దుష్కర్మముల జేయుట మాట యటుండనిండు; మనస్సునందైను దుష్టాలోచన కెడమీయడు. ఏలయనగా తాను మనోవాక్కాయములతో నే దుష్కర్మములు చేసినను నంతర్యామియై యున్న న్యాయకారియగు పరమేశ్వరునిచే తప్పక శిక్షింపబడుదునని యతడు గట్టిగా నెఱిగియుండును. మరి చక్కెర చక్కెర యన్నంతమాత్రమున తీపియు, వేపాకు వేపాకు అన్నంత మాత్రమున చేదును

కలుగక నాలుకతో రుచిచూచినపుడు తీపి, చేదు తెలియును. నామస్మరణ మాత్రమున లాభమేమియు గలుగదు.

ఇంకను కరణవ చ్చేన్న భోగాదిభ్యః' (బ్ర. సూ. 2-2-40) అను బ్రహ్మ సూత్రమునకు భాష్యము వ్రాయుచు శ్రీ శంకరభగవత్పాదులు -

"అథ లోకదర్శనానుసారేణ ఈశ్వరస్యాపి కించిత్ కరణానా మాయతనం కామేన కల్ప్యేత! ఏవ మపి నోపపద్యతే। సశరీరత్వే హి సతి సంసారివత్ భోగాది ప్రసంగాత్। ఈశ్వరస్యాపి అనీశ్వరత్వం ప్రసజ్యేత"

అనగా 'లోకమున వస్తువులను నిర్మించు కర్తలకు దేహాద్యవయవము లున్నట్లు సృష్టికర్తయగు నీశ్వరునకును హస్తపాదా ద్యవయవముల కాశ్రయమగు శరీరమును కోరి యంగీకరించుటయు తగదు. కారణ మేమన - ఈశ్వరుడు దేహధారియగునెడల నితరసాంసారిక జీవులవలె నతడును సుఖదుఃఖములకు లోబడవలసినవా డగును. అట్లంగీకరించిన నతనిలో ఈశ్వరత్వమే యుండదు. అత డీశ్వరుడు - నియామకుడు - కాడు.'

అనుచు ఈశ్వరు డెన్నడు దేహధారి కాడని స్పష్టముగా నిషేధించి యున్నారు.

ఆకార మనుగుణము జడములగు ప్రాకృతిక పదార్థములలో నుండు నది. కాని చేతనుడైన ఈశ్వరునియందు ఉండునది కాదు. కాన ఈశ్వరుడు నిరాకారుడే.

అవ॥ ఈశ్వరునకు ఆకారము లేనప్పుడు శక్తియెటనుండి వచ్చును? ఇతరుల తోడ్పాటు ఏమైన తీసికొనునా? అను సందేహము సాధారణముగ కలుగవచ్చును. దానిని తొలగించుటకు వెంటనే వరుసలో సర్వశక్తిమంతుడను విశేషణము నాలుగవదిగ చెప్పబడినది.

4. సర్వశక్తిమంతుడు

శక్తి - 'శక్లృ శక్తౌ' అను **ధాతువునుండి శక్తిశబ్ద మేర్పడినది. (యః సర్వం జగత్ కర్తుం శక్నోతి స శక్తిః) సమస్తజగత్తును చేయుట యందు సమర్థుడు. కాబట్టి ఈశ్వరుడు శక్తి యనబడును. (సర్వాః శక్తయో విద్యంతే యస్మిన్ స సర్వశ క్తిమా నీశ్వరః) తన కార్యమును చేయుటయందు అన్యుల**

సాయమును గోరడు తన సామర్థ్యముచేతనే తన సమస్త కార్యములను పరిపూర్ణముగ జేయుచున్నాడు. కాబట్టి పరమేశ్వరునకు 'సర్వశక్తిమంతు'దని పేరు. (స. ప్ర. ప్రథ. సము.)

ప్రశ్న : ఈశ్వరుడు సర్వశక్తిమంతు డగునా? కాదా?

ఉత్త : అవును. కాని సర్వశక్తిమంతు డను శబ్దమున కర్థము మీరు తలంచునట్లు కాదు. ఈశ్వరుడు తన పనులు - ఉత్పత్తి, పాలనము, ప్రళయము మొదలగువానియందు; సమస్తజీవుల పుణ్యాపాపములకు దగిన వ్యవస్థ చేయుటయందు కొంచెమైన నితరుల సహాయము తీసికొనడు. అనగా తన యనంత సామర్థ్యముచేతనే తన సమస్త కార్యములను సంపూర్ణముగ జేసికొనుచున్నాడు. ఇదియే సర్వశక్తిమంతు డను శబ్దమున కర్థము.

ప్రశ్న: పరమేశ్వరుడు సర్వశక్తిమంతుడు కనుక కారణమును, జీవులను గూడ నుత్పన్నము చేయగలడు. చేయలేడేని సర్వశక్తిమంతుడు కాజాలడు గదా?

ఉత్త : సర్వశక్తి మచ్ఛబ్దమునకు అర్థము ఇంతకుపూర్వమే వ్రాయబడినది. ఏమి? అసంభవమగు దానిని గూడ జేయగలవాడే సర్వ శక్తిమంతు డనబడునా? అసంభవమును, కారణము లేకయే కార్యమును జేయగలిగెనేని; కారణము లేక మరియొక్క ఈశ్వరు నుత్పన్నముచేసి తాను మృత్యువును బొంది జడుడు, దుఃఖి, అన్యాయకారి, అపవిత్రుడు, కుకర్మి మొదలగువాడు కాగలుగునా? లేదా? కనుక స్వాభావికనియమములను-ఉష్ణత్వముగల అగ్నిని, శీతలత్వము గల జలమును, పృథివ్యాది సమస్త జడములను విపరీతగుణములు గలవానిగా బరమేశ్వరుడును జేయజాలడు. ఈశ్వరనియమములు సత్యములును పూర్ణములును అయి యున్నవి. కాబట్టి పరివర్తనము కాజాలదు. కాన సర్వశక్తిమంతు డనగా నర్థము పరమాత్మ యితరులసాయము లేకయే తన సమస్త కార్యములను బూర్ణముగ జేయగలుగుట ననుట. (స. ప్ర. అష్ట.సము.)

దీనినిబట్టి వస్తువుయొక్క సహజధర్మము లయిన గుణకర్మ స్వభావములు మార్పరానివనియు, వస్తువున్నంతవరకు వస్తుధర్మ ముండు ననియు గ్రహింపవలెను.

5. న్యాయకారి

'ణీఞ్ ప్రాపణే' అను ధాతువునుండి న్యాయశబ్ద మేర్పడుచున్నది. (ప్రమాణై రర్థపరీక్షణం న్యాయః ఇది న్యాయసూత్రములకు వాత్స్యాయన భాష్యవచనము) (పక్షపాతరాహిత్యాచరణం న్యాయః) ప్రత్యక్షాది ప్రమాణములచే సత్యమని తేలినది, పక్షపాతరహితము అగు ధర్మరూప - ఆచరణము న్యాయము.

(న్యాయం కర్తుం శీల మస్య స న్యాయకారీ - ఈశ్వరః) న్యాయము - పక్షపాతరహిత మయిన ధర్మము - ఒనర్చుటయే యితని స్వభావము కాబట్టి న్యాయకారి ఈశ్వరుడు (స. ప్ర. ప్రథ. సము.)

ఇది మహర్షి దయానందసరస్వతి న్యాయకారి శబ్దమునకు చేసిన నిర్వచనము. దీనిని ఆస్తికులయిన వైదికులందరు నంగీకరింతురు. కాన జీవులు చేసిన పుణ్యపాపకర్మము లన్నింటికి సుఖదుఃఖరూప ఫలముల నీశ్వరు డొసంగుననియు, ఏ ఒక్క కర్మయు ఫలమనుభవింపకుండ నశింప దనియు, అట్లు నశించు నన్న కృతవిప్రనాశ మను శాస్త్రదోష మాపాదించు ననియు వైదికుల సిద్ధాంతము కాని -

ఆస్తికములయిన క్రైస్తవాది ఇతర మతములలో ఫలదాతగ భగవంతు నంగీకరించినను ఫలదాతృత్వమున విలక్షణత కనబడుచున్నది. అవి పునర్జన్మ నంగీకరింపవు. మృతులయిన జీవులు సమాధులలో నుందురనియు, తీర్పు దినమున పుణ్యపాపముల లెక్కించి పుణ్యము లధికములయిన పుణ్యలోకము, పాపము లధికములయిన పాపలోకమును స్థిరముగ వారికి భగవంతు డొసంగుననియు, నా మతముల వా రంగీకరింతురు. ఇందు తీసివేయబడిన కర్మములకు ఫల మనుభవింపవలసిన పని లేదు. ఇది అంత యుచితముగ కనబడదు.

అవ॥ న్యాయకారి యనుటచే తప్పుచేసినవారిని తప్పక దండించును. కనుక దయ యుండదేమో అని భ్రాంతి కలుగవచ్చును. అందువలన వెంటనే వరుసలో దయాళువు అను విశేషణము చెప్పబడినది.

6. దయాళువు

'దయ దాన గతి రక్షణ హింసాదానేషు' అను ధాతువునుండి దయాశబ్ద

మేర్పడుచున్నది. (దయతే దదాతి, జానాతి, గచ్ఛతి, రక్షతి, హినస్తి యయా సా దయా; బహ్వీ దయా విద్యతే యస్య స దయాలుః - పరమేశ్వరః) అభయము నిచ్చువాడు, సత్యాసత్యములను సమస్తవిద్యలను దెలియువాడు, సమస్త సజ్జనులను రక్షించువాడు, దుష్టులను యథాయోగ్యముగ దండించువాడు నగుటచే పరమాత్మకు 'దయాళు' వని పేరు. (స.ప్ర. ప్రథ. సము.)

దయా న్యాయములు

ప్రశ్న : ఈ రెండు గుణములు పరస్పర విరుద్ధములు. న్యాయము చేసెనేని దయయు, దయ చూపెనేని న్యాయమును దప్పిపోవును. ఏల యనగా కర్మముల కనుకూలముగ నెక్కువదక్కువలు లేక సుఖదుఃఖముల నిచ్చుట న్యాయము. అపరాధిని దండింపక వదలిపెట్టుట దయ యనబడును.

ఉత్త : న్యాయమునకు దయకు నామమాత్రమే భేదము. ఏలయనగా న్యాయముచే సిద్ధమగు ప్రయోజనమే దయచేతను సిద్ధమగుచున్నది. మనుష్యుడు అపరాధము చేయుటమాని దుఃఖమును బొందక యుండవలయు ననుటయే కద దండించుటవలన ప్రయోజనము ! కాబట్టి యితరులను దుఃఖమునుండి వదలించుటయే దయ. న్యాయమునకు మీరు చేసిన యర్థము సరియే, కాని అపరాధిని దండింపక వదలిపెట్టుట దయయని మీరు చేసిన యర్థము సరియైనది కాదు, ఏలయనగా అపరాధిని దండింపకుండిన దయ నాశనమైపోవును. ఒక అపరాధియగు బందిపోటు దొంగను వదలిపెట్టుట యనగా వేలకొలది ధర్మాత్ములకు దుఃఖమిచ్చుట యగును. ఒకనిని వదులుటవలన వేలకొలది జనులకు దుఃఖమును గలిగించునది దయ యెట్లు కాగలదు? ఆ దొంగను జంపుటవలన వేలకొలది మనుష్యులపై దయచూపుట యగుచున్నది. ఇదియే దయ.

ప్రశ్న : రెంటియర్థ మొక్కటియేయైన రెండుశబ్దము లేల? రెండుశబ్దము లుండుటవలననే వాని ప్రయోజన మొకటి గాదని చూపుచున్నది.

ఉత్త : అది సరికాదు. ఒక యర్థమున కనేకనామములును, అనేకార్థముల కొక్క నామమును ఉండవచ్చును. లోకమందు సత్యమును అసత్యమును విననగుచున్నది. కాని వానిని విచారించి నిశ్చయించుట మన

పని. ఈశ్వరుని సంపూర్ణమగు దయను జూడుడు. అతడు సమస్తజీవుల ప్రయోజనము సఫలమగుటకు జగత్తునందు సకల పదార్థములను సృజించి దానము చేసి యున్నాడు. దీనికంటె గొప్పదయ మరి యేమి యుండును ? ఇక న్యాయముఫలమో ప్రత్యక్షముగా జూచుచున్నాము. ఎక్కువతక్కువలగు సుఖదుఃఖముల వ్యవస్థయే న్యాయఫలమును చూపుచున్నది.

దయాన్యాయముల భేదము

మనస్సులో నందఱకును సుఖము కలుగవలయుననియు, దుఃఖము దూరము కావలయుననియు కోరి పనిచేయుట దయ. బాహ్య చేష్టలచేత బంధనఛేదనాదులచేత తగినట్లు దండించుట న్యాయము. అందరను పాపములనుండియు, దుఃఖములనుండియు దూరముచేయవలయు ననుటయే యీ రెంటి ప్రయోజనము. (స. ప్ర. సప్త సము.)

ఇట్లు ఈశ్వరుని సర్వశక్తిమత్త్వములో న్యాయము, దయ ఇమిడి యున్నవి.

7. అజన్ముడు

(నాస్తి జన్మ యస్య సః - యద్వా యో న జాయతే సః) జన్మ లేని వాడు లేదా పుట్టని వాడు పరమాత్మ.

జన్మ గలవానికి పూర్వము జననీజనకులు లేదా కారణపదార్థము ఉండితీరవలయును. మరి దానికి పూర్వము దానిజన్మకు కారణమగు మరొక పదార్థము ఉండవలెను. ఇట్లు పూర్వపూర్వము నాలోచించుచో కారణ పరంపర అంతుచిక్కదు. కాన నెక్కడనో యొకచోట ఆగక తప్పదు. అదియే మూలకారణము - జన్మలేనిది - అని అంగీకరింపవలెను. ఆ పదార్థమే పరమేశ్వరుడు. అత డజన్ముడు.

మరియు జన్మగలవానికి అంతము - నాశము - కూడ నుండును. ఇవి రెండు గలవాడు సదా సృష్టికర్తగ నుండజాలడు. కాన ఈశ్వరుడు అజన్ముడగును. ఈశ్వరు డజు డనుటకు వేదశాస్త్ర ప్రమాణములు :

1. "అజ ఏకపాత్ పృథివీ సముద్రః" (యజు. 34-53)

2. "**శంనో అజ ఏకపా ద్దేవో అస్తు** " (ఋ. 7-35-13)

3. "ప్రజాపతి శ్చరతి గర్భే అంత రజాయమానో బహుధా విజాయతే"
(యజు. 31-19)

ప్రజాపతి గర్భస్థజీవునియందును వ్యాపించి యున్నాడు. స్వ స్వరూపముతో అనుత్పన్నుడైనను అనేక ప్రకారములతో యోగుల (అంతః) యంతః కరణములందు విశేషముగా ప్రకటమగుచుండును.

ఇత్యాది వేదశాస్త్ర ప్రమాణములను బట్టి పరమాత్మ పుట్టుక లేని వాడని తెలియుచున్నది.

8. **అనంతుడు**

అంతము అనగా - అవధి - మర్యాద. అనగా నింత పొడవు - పొట్టి, నిడువు - వెడల్పు అని పరిమాణము. అది లేనివాడు పరమాత్మ.

ప్రమాణములు :

" అనంతం వితతం పురుత్రా " (అథ. 10-5-12)

" అనా ద్యనంతం మహతః పరం" (తై. ఉ. 2-1)

9. **నిర్వికారుడు**

(నిర్గతః వికారః వికృతిః యస్మాత్ సః నిర్వికారః) వికారశూన్యుడు. అనగా షడ్భావ వికారశూన్యుడు.

షడ్ భావవికారములు : (అస్తి) ఉనికి (జాయతే) పుట్టుట (వర్ధతే) పెరుగుట (విపరిణమతే) మార్పుచెందుట (క్షీయతే) క్షీణించుట (వినశ్యతి) నశించుట - అనునవి ఆరు భావపదార్థమునకు గలుగు వికారములు.

ఎట్లన - విత్తనములో (అస్తి) ఉన్నవృక్షము పృథివీజలముల సహకారముతో (జాయతే) పుట్టుచున్నది. (వర్ధతే) పెరుగుచున్నది. పూర్తిగ పెరిగిన పిమ్మట (విపరిణమతే) మార్పు చెందుచున్నది. అనంతరము (క్షీయతే) క్షీణించుచున్నది. తుదికి (వినశ్యతి) నశించుచున్నది. ఈ దశల (మార్పుల) కే షడ్ భావవికారము లందురు.

పరమాత్మ అఖండుడు, ఏకరసుడు. జీవుడుకూడ షడ్ భావవికారములు లేనివాడే. కాని శరీరసంబంధమున జాగ్రత్ స్వప్న సుషుప్తి అవస్థలు పొందును. అతడు ధరించు శరీరములో వికారములు - మార్పులు - ఉండును. కాని

పరమేశ్వరున కీ యవస్థలు లేవు ; ప్రకృతిబద్ధుడు కాడు గనుక.

**10. అనాది**

"డు దాఞ్ దానే" - అను ధాతువునుండి ఆఙ్ ' పూర్వకమై ఆది శబ్దమును, 'నఞ్ ' పూర్వకమై అనాదిశబ్దమును ఏర్పడుచున్నవి.

(యస్మాత్ పూర్వం నాస్తి పరం చాస్తి స ఆది రిత్యుచ్యతే. మహాభాష్య. 1-1-21) (న విద్యతే ఆదిః కారణం యస్య సోऽనాది రీశ్వరః) దేనికి పూర్వమం దేదియు లేక పరమందుండునో దాని కాది యని పేరు. అతని కాది కారణ మేదియు లేదు. కాబట్టి పరమేశ్వరునకు అనాది యని పేరు.

(స. ప్ర. ప్రథ. సము.)

కారణ పదార్థమునుండి కార్యపదార్థము ఏర్పడును. కాన కార్య పదార్థములకు ఆది (కారణము) ఉండును. ఈ కార్యకారణసంబంధము ప్రాకృతికపదార్థములలో నుండును. కాన నట కార్యపదార్థములకు ఆది (కారణము) ఉండును. ఆది యున్నవానికి అంతముకూడ నుండును. కాని పరమాత్మ కారణపదార్థమునుండి యేర్పడినవాడు కాడు. కాన నతనికి ఆది లేదు. అనాది యతడు. అనంతుడును.

**11. అనుపముడు**

(నాస్తి ఉపమా యత్ర సః అనుపమః) సాటి లేనివాడు. (న తత్సమ శ్చాభ్యధిక శ్చ దృశ్యతే - శ్వేతా. 6 - 8) అతనితో సమానుడు గాని అతనికంటె అధికుడు గాని యెవ్వడును లేడు. (స. ప్ర సప్త. సము.)

పరమాత్మకు సాటియైనవాడుగాని, అధికుడైనవాడుగాని మరొక డుండుచో సృష్టిలో కనిపించు నియమములు ఒకే తీరులో నుండుటకు వీలుండదు. సృష్టిలో ఘర్షణ - ఒడుదుడుకులు ఉండును. ఒకరు సృష్టించిన పదార్థము మరొకరు లయము చేయవచ్చును. బహునాయకత్వమున పదార్థముల గతి యొకే తీరుగా నుండనేరదు. కాని ఒకే తీరుగా జగత్తులోని పదార్థములగతి కనబడుచున్నది.కాన ఒకని యదుపులోనే ప్రపంచమున్నట్లు గ్రహింపవలసియున్నది. అందువలన నాతడు 'అనుపముడు' అనబడు చున్నాడు.

12. సర్వాధారుడు

లోకములో పదార్థము లన్నియు కదలుచున్నవి. కదలని పదార్థమే లేదు. గతిమంతములగు పదార్థము లొకదానితో నొకటి తాకకుండను, పడిపోకుండను ఉండవలెనన్న వానికి ఆధారముగ కదలని పదార్థ మొకటి ఉండవలెను. అదియే పరమాత్మ. ఎట్లన : ఊయెల ఊగుచుండును. దాని నియమబద్ధమగు గతికి కదలని దూలము ఆధారము. బండి చక్రము తిరుగుచుండును. దానికి కదలని ఇరుసు ఆధారము. అట్లే ధూమశకటము పరుగిడుచుండును. దానికి పట్టాలు ఆధారము. అట్లే చలించుచున్న ప్రపంచ పదార్థములకు అచలుడగు పరమాత్మ ఆధారము. అనగా సూర్యచంద్రాది సకల పదార్థములకు సకల ప్రాణులకు నతడే ఆధారుడు. జగదాధారుడు పరమాత్మ.

"స దాధార పృథివీం ద్యా ముతేమాం" (యజు. 13-4)

ఆ పరమాత్మ పృథివ్యాది లోకములను ధరించియున్నాడు. స్థిరముగ నుంచుచున్నాడు. లేకున్న ఒకదాని నొకటి తాకి యెప్పుడో నష్టమయ్యేడివి.

13. సర్వేశ్వరుడు

సర్వాధారుడనగా సేవకునివలె భారవాహకుడు గాడు. విశ్వమునకు ఆధారుడైయుండియు ఆధిపత్యముకూడ వహించియున్నాడు. సర్వ+ఈశ్వరుడు = విశ్వమునకు నియామకుడు - అధిపతి యతడు. ప్రకృతిని స్వాధీన మం దుంచుకొని జగద్రూపమును పరిణమింపజేయును. అనాదులగు జీవులకు కర్మఫలము లిచ్చును. ఇట్లు సర్వాధారత్వముతో పాటు సర్వేశ్వరత్వము కూడ పరమాత్మకు స్వయం సిద్ధమని గ్రహింపవలెను. "ఏష సర్వేశ్వర ఏష సర్వజ్ఞః" (మాండూ. 6)

14. సర్వవ్యాపకుడు

అనగా పరమాత్మ సృష్టిలో నంతట వ్యాపించియున్నాడు. అట్లు వ్యాపింపకున్న అనంతవిశ్వమును సృజింపజాలడు. ఏలయన - సృష్టికర్త లేనిచోట సృష్టిరూపకార్యము జరుగనేరదు. కాన సృష్టికర్త సృష్టిలో నంతట వ్యాపించి యుండకతప్పదు. అంతేగాదు. సర్వవ్యాపకుడు కాకున్న సర్వజ్ఞుడు

కాజాలడు ; సర్వాధారుడు కాజాలడు ; సర్వేశ్వరుడును కాజాలడు.
ప్రమాణములు :

"స పర్యగా చ్ఛుక్ర మకాయం" (యజు. 40-8)

"సర్వవ్యాపిన మాత్మానం" (శ్వేతా. 1-16)

"ఏకో దేవః.... సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా" (శ్వేతా. 6-11)

అందువలన అణువణువున పరమాత్మ ప్రపంచమంతయు వ్యాపించి యున్నాడు.

**15. సర్వాంతర్యామి**

(అంత ర్యంతుం నియంతుం శీలం యస్య సోzయ మంతర్యామీ) సమస్తమయిన ప్రాణిరూపమును, అప్రాణిరూపమును అగు జగత్తునందంతటను వ్యాపకుడయి అన్నిటిని నియమించువాడు కాబట్టి పరమేశ్వరునకు అంతర్యామి యని పేరు. (స. ప్ర. ప్రథ. సము.)

వ్యాపకశబ్దము వ్యాప్తవస్తువును బోధించును. దానిని లోతుగ నాలోచించుచో సుసూక్ష్మమయి ప్రకృతిలోను జీవునిలోను వ్యాపించి యుండుటచే బాహ్యవ్యాపకత్వముతో పాటు అంతర్వ్యాపకత్వము కూడ (లోపలను వ్యాపించి యున్నట్లు) బోధపడును. కాని అంతటితో చాలదు. దానితోపాటు అన్నిటిని నియమించువా డను నర్థము రావలెను. అందుకొఱకు సర్వాంతర్యామి విశేషణము వాడబడినది. సర్వాంతర్యామి కాకున్న జీవుల మానసిక దోషములు గ్రహింపజాలడు. గ్రహింపకున్న కర్మఫలదాత, న్యాయకారి కాజాలడు గదా!

ఇంకను సర్వవ్యాపకత్వముచే అనంతత్వము, సర్వాంతర్యామిత్వముచే సుసూక్ష్మత్వము పరమాత్మయం దున్నట్లు గ్రహింపనయ్యెడిని.

ప్రమాణములు :

**"య ఇమం చ లోకం పరం చ లోకం సర్వాణి భూతాని అంతరో య మయతి"** (శత. 14-6-7-3)

**"యః సర్వాణి భూతా న్యంతరో యమయ త్యేష త ఆత్మా అంతర్యా మ్యమృతః"** (బృ. ఉ. 3-7-15)

" కవి ర్మనీషీ పరిభూః" (యజు. 40-8)

16. అజరుడు

(నాస్తి జరా జీర్ణావస్థా యస్య సః) అజరుడన ముదిమి లేనివాడని యర్థము.

బాల్యము, కౌమారము, యౌవనము, జర, మరణము - అనునవి శరీరమునకు సంబంధించిన అవస్థలు; కాలికములు. ఇవి అనిత్యపదార్థములలో నుండు వికారములు. కాని నిత్యుడయిన ఈశ్వరునికి శారీరికములు, కాలికములు అయిన యీ వికారములు - అవస్థలు - ఉండవు. జీవుడు నిత్యుడయినను కర్మఫలముగ శరీరసంబంధ మేర్పడి యీ శారీరిక - అవస్థలు కలవా డగుచుండును. కాని యీశ్వరుడో శరీరధారి యెన్నడు కాడు. కనుక నాతని కీ జరాద్యవస్థలు కలుగుటకే వీలులేదు.

పరమాత్మ నిర్వికారు డని పూర్వము చెప్పియే యున్నాము.

ప్రమాణములు :

"వేదాహ మేత మజరం పురాణం" (శ్వేతా. 3-21)

" స వా ఏష మహా నజ ఆత్మా అజరోzమరోz మృతోzభయో బ్రహ్మ"
(బృ. ఉ. 4-4-25)

" స పూర్వేషా మపి గురుః కాలేనానవచ్ఛేదాత్ " ( యో. ద. 1-26)

17. అమరుడు

అనగా మరణరహితుడు ; అనగా సర్వదా ఉండువాడు అని యర్థము.

అజరుడు అనగా ముదిమి లేనివాడని చెప్పుకొంటిమి. ముదిమి (జర) శిథిలావస్థను దెలుపును. శిథిల మగునది పిమ్మట నశింపక తప్పదు. కాన శైథిల్యము - జరావస్థ - లేని పరమాత్మకు మరణావస్థకూడ లేదని చెప్పుటకే - స్పష్టపఱచుటకే - అమరుడు అను విశేషణము వెంటనే చెప్పబడినది.

పరమాత్మ అజన్ముడు కనుక అమరుడు నగును. ఏలయన-పుట్టిన వస్తువు చావక తప్పదు. పుట్టుట యనగా కారణపదార్థము కార్యరూపము (వికారము) పొందుట. గిట్టుట యనగా ఆ యేర్పడిన కార్యరూపము నశించి మరల కారణరూపము నందుట.

ప్రమాణములు :

"అమరో మృతోభయో బ్రహ్మ" (బృ. ఉ. 4-4-25)

"ఆనందరూప మమృతం య ద్విభాతి" (ముండక. 2-2-7)

18. అభయుడు

(నాస్తి భయం యస్య సః - యద్వా, నాస్తిభయం యస్మాత్ సః) పరమాత్మ యెవరికి భయపడడు; లేదా పరమాత్మనుండి ఎవరికి భయము లేదు. కనుక పరమాత్మకు అభయు డని పేరు.

భయము ఎప్పుడు కల్గును? ఎందుకు కల్గును? తనకు సమానుడు గాని లేదా అధికుడుగాని మరొక డున్నప్పుడు. అతనివలన నష్టముగాని కష్టముగాని కలుగవచ్చు ననెడి భయము ఏర్పడును. అందుకనియే (ద్వితీయా ద్వైభయం భవతి) రెండవవా డున్నప్పుడే భయము కలుగునని పెద్దలు చెప్పిరి. ఆ రెండవవాడు తనకు సమానుడుగాని అధికుడుగాని కావలెను. అట్లుకాక తక్కువ శక్తియుక్తులుగలవాడగుచో భయము కలుగనేరదు. పరమాత్మకంటె వేరుగ జీవులు, ప్రకృతి యున్నను నవి పరమాత్మకు లోబడియుండునవియే. కాబట్టి పరమాత్మకు సముడుగాని అధికుడు గాని లేడు. కాన పరమాత్మకు అభయుడు (ఎవరికి భయపడడు) అని పేరు గలిగినది. లేదా -

పరమాత్మ న్యాయకారి; దయాళువు కూడ. అందువలన సజ్జనులెవ్వరు నాతనినుండి భయపడవలసిన పనిలేదు. కనుక (ఎవరికి భయము లేదు) నావిధముగను పరమాత్మకు అభయుడను పేరు సార్థక మగుచున్నది.

"అమృతోऽభయో బ్రహ్మ" (బృ. ఉ. 4-4-25)

19. నిత్యుడు

(యో నిత్య ధ్రువోऽచలోऽవినాశీ స నిత్యః) నిశ్చలుడు, అవినాశియు నగుటచే పరమేశ్వరుడు నిత్యుడు.

పరమాత్మతో పాటు నిత్యపదార్థములు జీవుడు, ప్రకృతి - అనునవి మరిరెండు గలవు. కాని వానికంటె విలక్షణమైన నిత్యత్వము పరమాత్మయందు గలదు. ఎట్లన - ప్రకృతి మూల కారణరూపములో నిత్యమైనను ప్రపంచరూపములో - పరిణామము చెందు స్వభావము గలది. నిర్వికారము

కాదు. పరమాత్మలో - పరమాత్మలో నట్టి పరిణామముగాని వికారములు గాని కలుగవు. జీవుడు కూడ చేతనుడు ; నిత్యుడు. అయినను ప్రకృతిబద్ధు డగుచుండును. గనుక శరీరధారియై జాగ్రదాద్యవస్థలు పొందుచుండును. అట్లు ప్రకృతి బద్ధుడగుట కాని అవస్థలపాలగుట కాని పరమాత్మకు లేవు. అందువలన పరమాత్మ నిత్యులలో నిత్యుడు, చేతనులలో చేతనుడు అని చెప్పబడినాడు.

"నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానాం" (కఠ. 5-13)

" నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం" (ముండక. 1-1-6)

**20. పవిత్రుడు**

పవిత్రుడు అనగా స్వయముగ పవిత్రమైనవాడు - శుద్ధుడు. అంతేగాదు. తన జ్ఞానముద్వారా ఇతరులను గూడ పవిత్రము చేయువాడు అనియు నర్థము కలదు.

పరమాత్మ స్వయముగ పవిత్రు డగుయేగాక న్యాయకారి, దయాళువునై జీవులకు కర్మఫలముల నొసంగి వారిని గూడ పవిత్రులుగ జేయుచున్నాడు. కాన పవిత్రుడు అనబడుచున్నాడు. ''శుద్ధమపాపవిద్ధమ్'' (యజు. 40-8)

**21. సృష్టికర్త**

ఈ విశేషణము ఈశ్వరునికార్యమును దెలుపుచున్నది. సృష్టికర్తృత్వము ఈశ్వరుని పని. అయితే కర్తకు సృష్టించు శక్తియున్నప్పుడు పోషించు శక్తియు, నాశమొనర్చు శక్తియు నుండునని గ్రహింపవలెను. కావున జగదుత్పత్తి స్థితిలయములు ఈశ్వరాధీనము లని తెలియుచున్నది.

జగత్ సృష్టిని గమనించుచో గ్రహములయొక్క నియమబద్ధ గతులు వ్యక్తమగును. శరీరనిర్మాణమును పరిశీలించుచో - లోపలి యెముకల కూర్పు, నరములకట్టు, మాంసపుపూత, చర్మపుకప్పు, శ్వాసకోశము, పిత్తకోశము, ప్లీహాదులు, హృదయయంత్రస్థాపన, జీవుని సంయోజనము, శిరోరూపముల రచన, వెంట్రుకలు, గోళ్ళు మొదలగువాని స్థాపన, కంటి యందలి అతి సూక్ష్మమగు నరములు (తంతులబోలిన) బిగింపు, ఇంద్రియ భాగముల ప్రకాశము, జీవుడు అవస్థాత్రయమును భోగించుటకు తగినస్థాన విశేషముల

నిర్మాణము, సమస్త ధాతువుల విభాగకరణము - ఇత్యాది కళాకౌశలముతో గూడిన అద్భుత సృష్టి వ్యక్తమగును. (స. ప్ర. అష్ట. సము.)

ఇట్టి రచనావిశేషములను బట్టి సర్వజ్ఞుడు, సర్వవ్యాపకుడు, సర్వాధారుడు, సర్వేశ్వరుడు అయిన సృష్టికర్త యొక డున్నట్లు గోచరించును. అతడే పరమేశ్వరుడు.)

ప్రమాణములు :

**"ఇయం విసృష్టి ర్యత ఆ బభూవ యది వా దధే యది వా న ।**
**యో అస్యాధ్యక్షః పరమే వ్యోమన్ సో అంగ యది వా న వేద ॥**

(ఋ. 10-129-7)

ఓ మనుష్యుడా! ఎవనిచే నీ వివిధసృష్టి ప్రకాశితమై యున్నదో, ఎవడు జగత్తును ధరించి ప్రలయము చేయుచున్నాడో, ఎవడు జగత్తునకు స్వామియో, ఏ వ్యాపకునియం దీ జగత్తంతయు ఉత్పత్తి స్థితి ప్రలయములను పొందు చున్నదో అతడే పరమాత్మ. అతనిని నీవు తెలుసుకొనుము. ఇతరుని సృష్టికర్త యని నమ్మకుము.

"హిరణ్యగర్భః సమవర్త తాగ్రే" (ఋ. 10-121-1)

"పురుష ఏ వేదం సర్వం" (యజు. 30-2)

"జన్మా ద్యస్య యతః' (బ్ర. సూ. 1-1-2) (స.ప్ర. అష్ట. సము.)

ఇత్యాది వేదశాస్త్ర ప్రమాణములను బట్టి ప్రపంచము యొక్క సృష్టి స్థితి లయములకు నిమిత్తకారణము పరమాత్మ యని బోధపడుచున్నది."

**ఇతర మతముల పరిశీలన**

" బ్రహ్మ సత్యము ; జగత్తు మిథ్య ; జీవుడు బ్రహ్మమే ; భిన్నుడు కాడు" అనునది అద్వైత సిద్ధాంతము. ఈ రెండవ నియమములో ఈశ్వరుని సృష్టికర్తగా చెప్పుటచే ప్రపంచము (జగత్తు) మిథ్య కాదని బోధపడుచున్నది. ఈశ్వరుని ఉపాస్యునిగా చెప్పుటచే ఉపాసకుడయిన జీవుడు బ్రహ్మకంటె భిన్నముగ నున్నట్లు తేలుచున్నది. మరి సచ్చిదానందస్వరూపు' డను విశేషణముయొక్క వ్యాఖ్యానములో జీవేశ్వర ప్రకృతులు - మూడు - నిత్యసత్యములయిన పదార్థములున్నట్లు చెప్పియే యున్నాము. ఇట్లు

వైదికత్రైతవాదమువలన అద్వైతవాదము (కేవలచేతనవాదము) ఖండిత మగుచున్నది.

అంతేగాదు. ప్రపంచపదార్థములలోని చైతన్యద్యోతకమగు క్రియా కౌశలమును బట్టి సృష్టికర్తగ పరమేశ్వరు నంగీకరించుటచే భౌతిక (కేవలజడ) వాదమును పరాస్తమగుచున్నది.

మరియు ఈశ్వరుడు నిరాకారుడు అని చెప్పుటవలన సాకారవాదము, అవతారవాదము నిషేధింపబడుచున్నవి.

సర్వవ్యాపకుడు, సర్వాంతర్యామి, సర్వేశ్వరుడు అని చెప్పుటవలన భగవంతుడు వైకుంఠములోనో, కైలాసము మీదనో - లేదా నాల్గవ ఆకాశములోనో, ఏడవ ఆకాశములోనో - ఉన్న ఏకదేశీయుడు కాడని తెలుచున్నది. దానితో అనేక దేవతావాదము కూడ ఖండితము అగుచున్నది.

ఇంకను లోకములో ఏ పదార్థము కేవలనిర్గుణముగాని, కేవల సగుణముగాని కానేరదు. ప్రతిపదార్థము తన గుణములతో సగుణము, పరగుణరాహిత్యముతో నిర్గుణము అగుచుండును. అట్లే పరమేశ్వరుడు 'సచ్చిదానంద స్వరూపుడు, సర్వశక్తిమంతుడు, న్యాయకారి, దయాళుడు, సర్వాధారుడు, సర్వేశ్వరుడు, సర్వవ్యాపకుడు, సర్వాంతర్యామి, నిత్యుడు, పవిత్రుడు, సృష్టికర్త' - అను విశేషణములతో సగుణుడుగాను, 'నిరాకారుడు, అజన్ముడు, అనంతుడు, నిర్వికారుడు, అనాది, అనుపముడు, అజరుడు, అమరుడు, అభయుడు' - అను విశేషణములతో నిర్గుణుడుగాను చెప్పబడుటచే ఈ నియమములో భగవంతుని సగుణ నిర్గుణ స్వరూపము స్పష్టపరుపబడినది.

ఇట్లు నిర్దుష్టముగా నిస్సందేహముగా వైదిక - ఈశ్వరస్వరూపము ఈ నియమములో తెలుపబడినది.

ఇక ఈ నియమములో రెండవభాగము " అతనినే యుపాసించుట యోగ్యము" అనునది.

సత్యము, న్యాయము, దయ, సామర్థ్యము, సర్వజ్ఞత్వా ద్యనంత గుణములు పరమేశ్వరుని కున్నట్లు ఏ జడపదార్థమునకు గాని జీవునకు గానిలేవు. ఏ పదార్థము సత్యమో దాని గుణకర్మస్వభావములును సత్యములే.

కాబట్టి సచ్చిదానందస్వరూపుడగు పరమేశ్వరుని స్తుతి ప్రార్థనోపాసనలే మనుష్యులకు యోగ్యములు. అంతకంటె భిన్నమగు పదార్థముల నెన్నడు నుపాసింపరాదు.

బ్రహ్మ, విష్ణు ,మహాదేవ నామకులగు పూర్వపుమహాశయులును, విద్వాంసులును, దైత్య దానవాది నికృష్ట మనుష్యులును గూడ పరమేశ్వరుని యందే విశ్వాసముంచి అతని స్తుతిప్రార్థనోపాసనలే చేసిరి. అతని కంటె భిన్నమగువానిని గూర్చి చేయలేదు. అట్లే మనమందరము చేయుట యోగ్యము.

(స.ప్ర. ప్రథ. సము.)

"అంధం తమః ప్రవిశంతి యేஉసంభూతి ముపాసతే" ఇత్యాది యజుర్వేద మంత్రముకూడ జడపూజలు అజ్ఞానమూలకము లని హెచ్చరించుచున్నది.

ఇక నతిప్రసంగముగ భాసించినను ఇట నొక విషయము చెప్పవలసి యున్నది. ఏమన - సంప్రదాయవాదులు ఈశ్వరోపాసనకు బదులు జడపూజలు, సాటి మానవులపూజలు నెలకొల్పి మనుష్యులను లేచుటకు వీలులేని గోతిలో పడవేసిరి. ఈశ్వరునకు దూరము చేసిరి. ఈ విషయము అర్థమగుటకై క్రింది దృష్టాంతమును గమనింతురు గాక!

"ఒక మనుష్యుడు విమానములో ఆకాశవిహార మొనర్చుచుండెను. కొంతదూర మేగుసరికి వేలకొలది జనము ఒక వ్యక్తిని పల్లకీలో కూర్చుండ బెట్టుకొని మేళతాళములతో ఊరేగించుచుండిరి. మరికొంత దూర మరుగుసరికి ఏనుగుపై నెక్కించి ఒక మహానుభావుని జను లూరేగించుచుండిరి. ఇంక కొంతదూరము పోగా నిట్లే కొందరు శిష్యులచే సేవలందుకొను ఒక వ్యక్తి కనబడెను. మరికొంతదూరము వెళ్ళగా భక్తులు కొందరు సువర్ణ విగ్రహమునకు షోడశోపచారపూజలు చేయుచుండిరి. ఈతీరున పోనుపోను ఒకచో నొక కుటీరమందు కోటి సూర్య ప్రభా భాసమానుడగు నొక మహానుభావుడు ఒంటరిగా కూర్చుండెను. "

ఈ ఒంటరి వ్యక్తి యెవరు? ఆ విగ్రహ మెవరిది? ఊరేగింపులతో సేవలతో ప్రజల మన్నన లందుకొను వ్యక్తులెవరు ? అని విచారింపగా ఊరేగువారు మహమ్మదు, క్రీస్తు, బుద్ధుడు ననియు; విగ్రహము భగవంతుని

ప్రతిమ యనియు; ఒంటరిగా నున్నది పరమేశ్వరు డనియు వైమానికుడు తెలిసికొనెను.

ఇది స్వప్నములో జరిగినఘట్టము. కల్పితముకూడ కావచ్చును. ఏమైనను దీనివలన లోకవ్యవహారము, నీతి బోధపడుచున్నది. ఎట్లన : "ప్రతి మతస్థులు - సంప్రదాయకులు పరమేశ్వరునికంటె తమతమ గురువులకు, దేవతా ప్రతిమలకు ఎక్కువ ప్రాధాన్యత యిచ్చుచున్నట్లు బోధపడుచున్నది. అనగా ఈశ్వరపూజకు బదులు గురువులపూజలు, జడవస్తువుల పూజలు చేయుచున్నారు; చేయించుచున్నారు. ఈశ్వరుని దూరము చేసినారు. అత డొంటరివా డైనాడు. అతని నారాధించు - ఉపాసించు - వారు లేరు." అని యీ ఉపాఖ్యానమువల్ల బోధపడుచున్నది.

లోకముయొక్క యీ స్థితిని గమనించియే మహర్షి దయానంద సరస్వతి విగ్రహారాధన నరకమునకు మొదటి మెట్టని తన సత్యార్థప్రకాశములో గట్టిగ హెచ్చరించిరి - మందలించిరి. అంతేగాదు. ఆర్యసమాజ నియమములు పదింటిలో మొదటి రెంటియందు ఈశ్వరుని గుణకర్మ స్వభావముల వర్ణించి యాతనినే ఉపాసించుట యోగ్యము - అనియు తెలియజేసిరి.

**పరమేశ్వరునే ఉపాసింపవలెననుటకు ప్రమాణములు**

" ఏక ఏవ నమస్యః సుశేవాః" (అథ . 2-2-1)

ఉత్తమ సుఖ సంపన్నుడు, అద్వితీయుడు నైన పరమాత్మ యొక్కడే ఉపాసింపదగినవాడు.

**" యోzన్యాందేవతా ముపాసతే పశురేవ స దేవానామ్"**

**(శత. 14 - 2-2-22)**

పరమాత్మను వీడి (ఏకేశ్వరోపాసన వీడి) యితర దేవతల నుపాసించు వాడు విద్వాంసులలో పశువు.

ఇట్లు వేదశాస్త్రములు సృష్టికర్తయగు పరమేశ్వరునే యుపాసింపవలెను. కాని మరి దేనిని ఉపాసింపరాదని ఆదేశించుచున్నది.

### ఉపాసనా పద్ధతి

ఉపాసకుడు యమ నియమాది యోగాంగముల పాటింపవలయును. ఉపాసన చేయవలసినపుడు ఏకాంతమగు పరిశుద్ధదేశమందు ఆసనము వేసికొని ప్రాణాయామము చేసి బాహ్యావిషయములనుండి యింద్రియముల నాకర్షించి మనస్సును నాభిప్రదేశమందుగాని, హృదయమందుగాని, కంఠమందు గాని, నేత్రములయందుగాని, శిఖయందుగాని, వెన్నెముకయందు - బ్రహ్మ దండియందుగాని స్థిరపఱచి స్వాత్మపరమాత్మల వివేచన చేయుచు పరమాత్మ యందు మగ్నుడై సంయమి కావలయును. ఈ సాధనములను జేసినపుడు ఆతని యాత్మయు, అంతఃకరణమును పవిత్రములై సత్యపూర్ణము లగుచున్నవి. ప్రతిదినము జ్ఞానమును, విజ్ఞానమును వర్ధిల్లిముక్తిని కూడ పొందును. ఎనిమిది జాములలో నొక్క గడియయేని ఇట్లు ధ్యానించుచో నతడు సర్వదా ఉన్నతినే పొందదొడగును. (స. ప్ర. సప్త. సము)

### ఉపాసనా భేదములు

సర్వజ్ఞత్వాదిగుణములతో పరమేశ్వరు నుపాసించుట సగుణోపాసన. ద్వేష,రూప, రస, గంధ, స్పర్శాదిగుణములచే వేరని యెంచి అతి సూక్ష్మమగు నాత్మకు లోపలను వెలుపలను వ్యాపించియుండు పరమేశ్వరునియందు దృఢస్థితు డగుట నిర్గుణోపాసన - అని ఉపాసన రెండు విధములు. ఈ రెండు విధములగు నుపాసనతో చిత్తమందు పరమేశ్వరుని స్వరూపమును నిత్యము మననము చేయవలెను.

### ఉపాసనా ఫలము

శీతముచే బాధితుడగు పురుషుడు అగ్నిని సమీపించుటచే శీతము నివృత్తియగునట్లు పరమేశ్వరుని సమీపించుటచే సమస్తదోషములును దుఃఖములును బోయి పరమేశ్వరుని గుణకర్మస్వభావములవలె జీవాత్మ గుణకర్మస్వభావములును పవిత్రము లగును. కాబట్టి పరమేశ్వరుని స్తుతి ప్రార్థనోపాసనల నవశ్యము చేయవలయును. దీనికి తక్కిన ఫలము లటుండగా పరంతమంతటి దుఃఖము ప్రాప్తించినను భయపడక సహింపగలుగును.

అధ్యాత్మికబలము వర్ధిల్లును. ఇది యేమి సాధారణమా?

ఇది గాక పరమేశ్వరుని స్తుతి ప్రార్థనోపాసనలు చేయనివాడు మహా మూర్ఖుడు, కృతఘ్నుడు నగును. ఏలయనగా - ఏ పరమాత్మ యీ జగత్తులో సమస్తపదార్థములను జీవులసుఖముకొఱకు ప్రసాదించి యున్నాడో, అతని గుణములను మరచుటయు, ఆ ఈశ్వరునే నమ్మకుండుటయు, కృతఘ్నత, మహామూర్ఖతయు గాక మరేమి యగును ? (స.ప్ర. సప్త. సము.)

**ఈ నియమ రచనకు ఆధారమగు మంత్రములు**

**"స పర్యగా చ్ఛుక్ర మకాయ మవ్రణ మస్నావిరగ్ం**
**శుద్ధ మపాపవిద్ధం, కవి ర్మనీషీ పరిభూః**
**స్వయంభూ ర్యాథాతథ్యతోऽర్థాన్**
**వ్యదధా చ్ఛాశ్వతీభ్యః సమాభ్యః" (యజు. 40-8)**

సర్వవ్యాపకుడు, సర్వశక్తిమంతుడు, నిరాకారుడు, శుద్ధుడు - పవిత్రుడు, సర్వజ్ఞుడు, అంతర్యామి, అనాదిస్వరూపుడు నగు నా పరమాత్మ కల్పారంభమున వేదముద్వారా శబ్దార్థములు, వానికి గల సంబంధమును దెలుపు విద్యలను మానవుల కుపదేశించియున్నాడు. అందువలన నా పరమాత్మనే యెల్లపుడు ఉపాసింపవలెను.

**"వేదాహ మేతం పురుషం మహాంత**
**మాదిత్యవర్ణం తమసః పరస్తాత్ ।**
**తమేవ విదిత్వాతిమృత్యు మేతి**
**నాన్యః పంథా విద్యతే ऽయనాయ ॥" (య. 31-18)**

పరమాత్మ అన్నింటికంటె గొప్పవాడు. స్వయంప్రకాశుడు. అవిద్యాంధకార రహితుడు. మరణాద్యగాధ దుఃఖసాగరమునుండి తరించుటకు అతనినే ఉపాసింపవలెను. ఇతరుల నుపాసింపరాదు.

ఇత్యాదిమంత్రముల యాధారముతో ఈ రెండవనియమము రచింప బడినది.

## మూడవ నియమము

అవ॥ జ్ఞానజ్ఞేయములకు ఆదిమూలము . పరమేశ్వరుడని మొదటి నియమములో చెప్పబడినది. పరమేశ్వరుని గుణకర్మస్వభావముల దెలుపు విశేషణములతో వర్ణించి సృష్టికర్తగ బేర్కొని యతనినే ఉపాసించుట యోగ్యమని రెండవనియమములో చెప్పబడినది. ఇక పై విషయములు సంపూర్ణముగ దెలిసికొనుటకు తగిన యాధారము చూపవలసియున్నది. అదియే మూడవ నియమములో చూపబడుతుంది.

నియమము

**"వేద్ సబ్‌సత్యవిద్యాఓంకా పుస్తక్ హై. వేద్ కా పఢనా పఢానా, ఔర్ సున్‌నా సునానా సబ్‌ఆర్యోంకా పరమధర్మహై"**

తా॥ వేదము సమస్తవిద్యల గ్రంథము. దీనిని చదువుట - చదివించుట, వినుట - వినిపించుట ఆర్యుల కందరికి పరమ ధర్మము.

**పూర్వగాథ**

ఈ నియమాన్ని వ్యాఖ్యానించడానికి ముందు అప్పటి దేశకాల పరిస్థితులను, మహర్షి దయానందసరస్వతి యీ నియమం రచించుటలో గల ముఖ్యాభిప్రాయాన్ని కొంతవరకు పరిశీలింపవలసియున్నది.

వేదకాలంలో ఈశ్వరీయము లయిన ఋగాదివేదములు నాలుగు పరమ ప్రమాణములుగా భావించి మహర్షులు వానికి బ్రాహ్మణములు, అరణ్యకములు, ఉపనిషత్తులు వ్యాఖ్యానరూపంలో రచించారు. ఇవి పరతఃప్రమాణములుగా భావింపబడినవి. అప్పుడు వేదమతం తప్ప మరొక మతం లేనేలేదు. తరువాత మధ్యకాలంలో - భారతయుద్ధం మూలకంగా పండితుల కొరత యేర్పడి వేదప్రచారం లోపించింది. అవిద్యాంధకారం వ్యాపించి మనుష్యులబుద్ధి భ్రమజెంది యెవరికి తోచిన మతం వారు ప్రజలలో వ్యాపింపజేశారు.

శ్రీశంకర రామానుజాది - ఆచార్యులు వేదేతర బ్రహ్మణాదులను కూడ వేదములుగా ప్రచారం చేసి తమతమ మతములను - సంప్రదాయములను స్థాపించారు. అంతేగాదు. స్త్రీ శూద్రులకు వేదాధ్యయనం నిషేధించి ఆంక్షలు

పెట్టారు. ఒకవేళ యెవరైనా చదివినా, విన్నా జిహ్వాచ్ఛేదనం, త్రపు జతులతో (సీసము - లక్క) శ్రవణపూరణం మున్నగు శిక్షలు విధించారు.

అంతట వారు స్థాపించిన నానామతములు, రచించిన మత గ్రంథములు మూలకంగా నానాదేవతలు వెలసినవి. దేవతా ప్రతిమల - జడవస్తువుల పూజలు ఏర్పడినవి. అంధానుకరణంతో జడపూజలవలన ప్రజలు జడులై ఆలోచించుటయే మానివేశారు.

ఇది యిట్లుండ - కొందరు ఆచార్యులు వేదమంత్రములను ఆధారం చేసి యజ్ఞములందు పశుహింసావిధానం యేర్పరిచారు. దీనిఫలితంగా విచారశీలురగు పెద్దలకు వేదములపయిని గౌరవభావం నశించింది. చులకన భావం - జుగుప్స యేర్పడ్డది.

ఇట్లు అవైదిక పౌరాణిక మతాలవల్ల ప్రజలలో వేదవిజ్ఞానం దూరమై అజ్ఞానం ఆవరించింది.

ఇదొకవైపున ఇట్లుండగా - మరొకవైపున సాయణ, ఉవ్వట, మహీధరాది భాష్యకారుల వ్యాఖ్యలవల్ల వేదముల నధ్యయనం చేసిన పాశ్చాత్యపండితులకు, వారిని అంధానుకరణం చేసిన భారతీయ విద్వాంసులకు వేదములు పౌరుషేయములుగా కనబడినవి. ఆదిమానవుల సుద్దులుగా వారికి తోచినవి. వాటిలో నానా దేవతల వర్ణనలు, మానవుల చరిత్రలు ఉన్నట్లును, ఉచ్చస్థాయికి చెందిన విజ్ఞానం లేనట్లును వారు భావించారు. అంతటితో వారు ఊరుకోలేదు. 'పాశ్చాత్యుల పరిపాలన భారతదేశంలో స్థిరంగా పాదుకొనాలంటే వేద విజ్ఞానం భారతీయ సంస్కృతి నశింపజేసి వాటి స్థానంలో పాశ్చాత్య విజ్ఞానం, పాశ్చాత్య సంస్కృతి భారతీయులకు కలిగించాలి.' అని పాశ్చాత్యపండితులు ఆలోచించారు. కుట్రలు పన్నారు. అందుకు తగ్గట్లు వేదములపై చులకనభావం కలిగిస్తూ భాష్యాలు వ్రాసి ఉన్నతవిద్యలకు ఇంగ్లాండుచేరిన భారతీయులకు బోధించారు. దానితో గ్రుడ్డిగా పాశ్చాత్యుల ననుకరించు భారతీయవిద్వాంసులకు వేదములపై నీరసభావం కలిగింది. పాశ్చాత్యవామోహం పెరిగింది. ఇంకేమి చెప్ప! భారతీయసంస్కృతి నశించి వారిలో పాశ్చాత్యసంస్కృతి పాదుకొన్నది. భావదాస్యం యేర్పడి దేశీయత అడుగంటింది. ఆస్తికత్వం పోయి నాస్తికత్వం ప్రవేశించింది.

ఈ స్థితిలో మహర్షి దయానందసరస్వతి ప్రాదుర్భవించారు. గురువు (విరజానంద) నాజ్ఞవల్ల వేదధర్మప్రచారానికి పూనుకొన్నారు. దేశం స్థితి, దేశీయుల స్థితి అర్థంచేసుకున్నారు. దానికి తార్కాణం ఆయన వ్రాసిన మాటలే. ఏమన :

"ఇప్పటికి సుమారు అయిదువేల సంవత్సరాలకు పూర్వం వేద మతం తప్ప మరొకమతం లేకుండె ననుటయే నిర్వివాదాంశం. మరి వేద ప్రచారం లోపించడానికి కారణం అప్పటి భారతయుద్ధమే. ఆ లోపంవల్ల అవిద్యాంధ కారం భూగోళమంతటా ఆవరింపగా మనుష్యులబుద్ధి భ్రమచెంది యెవరికి తోచిన మతమున వారు ప్రవేశపెట్టసాగారు. వాటన్నిటిలో వేదవిరుద్ధాలయిన పౌరాణిక, జైన, క్రైస్తవ, మహమ్మదీయములను నాల్గు మతాలే తక్కిన యన్నింటికి మూలభూతాలు."

ఇవి మహర్షి తన సత్యార్థ ప్రకాశం ఉత్తరార్ధం అనుభూమికలో వ్రాసిన మాటలు.

ఇట్లు దేశంయొక్క పరిస్థితిని మహర్షి అర్థం చేసుకొన్నారు. కాని ప్రజలలో అజ్ఞానం పోవాలంటే - "వేదవిరుద్ధ-అవైదిక గ్రంథాలమీద వారికి ప్రామాణ్యబుద్ధి పోవాలి. ఈశ్వరీయములయిన వేదాలు సమస్త సత్యవిద్యల గ్రంథాలుగా విశ్వాసం కలగాలి. అందుకుగాను వేద పఠనపాఠనములు శ్రవణ శ్రావణములు నిషేధిస్తూ స్త్రీ శూద్రులకు పెట్టిన ఆంక్షలు, విధించిన శిక్షలు వంచనతో కూడినవని ఋజువు చేయాలి. జన్మతోవచ్చిన వర్ణలింగ భేదం లేకుండ సర్వమానవులకు వేదాధికారం కలదని యుక్తి ప్రమాణాలతో ఋజువు చేసి అమలుపరచాలి."

అందుకొఱకు మహర్షి తన అగాధ పాండిత్యబలంతో వేలకొలది సంవత్సరాలనుండి చెత్తచెదారముల మరుగున బడియున్న వేదాలను పెళ్ళగించి పైకి తీశారు. వేదములపైన వ్యాపించిన దురభిప్రాయాలను తొలగించుటకు ఉపన్యాసములద్వారా, పత్రవ్యవహారముద్వారా, గ్రంథరచనల ద్వారా ప్రయత్నించారు. ఈశ్వరీయములుగా, సమస్తసత్యవిద్యల గ్రంథములుగా వేదములను ఋజువుచేశారు. స్త్రీశూద్రులకు వేదాధికారం కలదని యుక్తి

ప్రమాణములతో, ఉదాహరణములతో (స. ప్ర. 3 సము.) నిరూపించారు. 'యథేమాం వాచం కళ్యాణీ మావదాని జనేభ్యః' - అను యజుర్వేద మంత్ర ప్రమాణంతో ఈశ్వరీయవేదము నధ్యయనం చేయడానికి మానవ మాత్రునికి అధికారం కలదని ఋజువు చేశారు.

ఆ మంత్రం ఆధారంతోనే యీ మూడవ నియమం రచించి వేద పఠన పాఠములు, శ్రవణశ్రావణములు ఆర్యులందరికి పరమధర్మంగా ముఖ్య కర్తవ్యంగా నిర్ణయించారు. - విధించారు.

దీనినిబట్టి వేదం సమస్తసత్యవిద్యల గ్రంథంగా తెలుసుకొని, దాని పఠనపాఠనములు, శ్రవణ శ్రావణములు పరమధర్మంగా ఆర్యులందరు - ఆర్యసమాజ సభ్యులందరు పాటించాలి - అని తేలుతుంది.

మహర్షి యీ నియమాన్ని రచించడానికి యింతటి పూర్వగాథ (Back Ground) ఉన్నది

**వేదసంఖ్యా విచారణ**

ఇక ఈ నియమవ్యాఖ్యానం పాఠకులు చదువుదురు గాక!

ఈ నియమం కూడ రెండుభాగాలుగా ఉంది. 'వేదము సమస్త సత్య విద్యల గ్రంథము -' అనునది మొదటి భాగం.

శాస్త్రాలలో అక్కడక్కడ 'త్రయీ విద్యా, అను వ్యవహారం వేదాలకు కనబడుతుంది. దానినిబట్టి ఋగ్యజుస్సామములు మూడే వేదాలని కొందరు పండితులు భ్రమపడుతుంటారు. అది సరికాదు. ఆధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మికము లను త్రివిధ విషయాలకు సంబంధించిన జ్ఞాన ముండుటచే వేదములకు 'త్రయీ విద్యా' అను వ్యవహారం వచ్చినట్లు కనబడుతుంది. నాలుగు వేదాలు కర్మ-ఉపాసనా-జ్ఞానములకు సంబంధించిన (త్రివిధ) విషయములను బోధించుటచే వానికి త్రయీవిద్యా అను వ్యవహారం వచ్చినట్లు పండితులు చెప్పుతూ ఉంటారు. అంతేగాదు. "వేదవిద్య ఋగ్యజుస్సామము లను మూడు రూపాలలో నున్నందున త్రయీవిద్య అనబడుతుంది. ఋక్కు అనగా పద్యం, యజుస్సు అనగా గద్యం, సామ అనగా పాట, ఇట్లు, నాల్గువేదాలలోని మంత్రాలు పద్యగద్య గానాత్మకములుగా నుండుటచే

త్రయీ విద్యావ్యవహారం వచ్చినట్లు" జైమిని పూర్వ మీమాంసవల్ల తెలుస్తుంది. అయితే ఋగాదుల యాధిక్యతనుబట్టి గ్రంథాలకు కూడ ఆ పేర్లే వచ్చినవి. అనగా ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం అను పేర్లు. అంతమాత్రాన నాలుగవదైన అథర్వవేదం లేదని తలంపరాదు. అందువల్ల వేదంఅన్నా, త్రయీ విద్య అన్నా, నాల్గువేదాలను గ్రహించాలి. వేదశాస్త్రములందు చతుర్వేదములకు బోధకముగా వేదశబ్దము ఏకవచన బహువచన రూపాలలో వాడబడుతూ ఉంటుందనియు గ్రహించాలి.

**వేదవ్యాస విషయము**

అయితే యిట మరొక ప్రశ్న పాఠకులకు కలగువచ్చు. ఏమంటే - "ఒకే రూపంలో ఉన్న వేదమును ద్వాపరాంతంలో కృష్ణద్వైపాయనుడు - వ్యాసుడు - నాలుగుగా విభజించినట్లు (వాయు) పురాణములలో గలదు. అందువల్లనే వేదవ్యాసు డను ప్రసిద్ధికూడ నాతనికి వచ్చినది." మరి దీనికేమి సమాధానం? అను ప్రశ్న కలుగుతుంది.

(1) ఆదిని ఒకేవేదం ఉన్నచో దానిపేరు భారతీయ-ఇతిహాసంలో ప్రసిద్ధి కెక్కి యుండేది. అట్లు ఎక్కడా కనబడదు.

(2) మహాభారత, రామాయణములలో నాలుగువేదము లున్నట్లు వర్ణనలు గలవు.

(3) పురాణములలోని యీ కల్పన అసత్య మనడానికి ప్రబల ప్రమాణం - ఉపనిషత్తులలో గాని, ఆరణ్యకములలోగాని, బ్రాహ్మణ గ్రంథములలో గాని ఎక్కడా ఒకే వేదమున్నట్లు చెప్పబడలేదు.

(4) అట్లే వేదములలోకూడ ఎక్కడా ఒకే వేదమున్నట్లు చెప్పబడలేదు. విశేషించి నాల్గువేదముల వర్ణన కన్పిస్తూ ఉన్నది.

ఉదా: **"తస్మా ద్యజ్ఞాత్ సర్వహుత ఋచఃసామాని జజ్ఞిరే**
**ఛందాంసి జజ్ఞిరే తస్మాద్యజు స్తస్మాదజాయత. "**
(ఋ. 10-9-9, య 31-7., అథ19-6-13)

ఇది పురుషసూక్తములోని మంత్రము. మూడు వేదములలో నున్నది. సృష్టిప్రారంభంలోనే పరమాత్మనుండి నాల్గువేదములు ప్రకటమైనట్లు ఈ మంత్రము చెప్పుచున్నది.

వేదం ఈశ్వరీయం

ఇట మొదటి నియమంలో 'సమస్త సత్యవిద్యలకు ఆదిమూలము పరమేశ్వరుడు' - అని చెప్పబడింది. ఈ మూడవ నియమంలో సమస్త సత్యవిద్యల గ్రంథము వేదము' - అని చెప్పబడింది. ఈ రెండు వాక్యాలను కలిపి చదువుచో, సమస్త సత్యవిద్యలుగల వేదమునకు ఆదిమూలము - ముఖ్యాశ్రయము పరమేశ్వరుడు అని బోధపడుతుంది. అనగా వేదమీశ్వరీయము - ఈశ్వరునిచే ఒసంగబడినది అన్నమాట.

వేద మీశ్వరీయము - అపౌరుషేయము - అని వైదికులెల్లరు విశ్వసిస్తారు. అంతేగాదు. సృష్ట్యాదిని మానవసృష్టితోపాటు ప్రకాశితమైనట్లును నమ్ముతుంటారు. అందువల్లనే వేదములకు 'ప్రాజదువులు' (ప్రాత+చదువులు) అను పేరుకూడ తెలుగులో ప్రసిద్ధమైనది.

వైదికుల యీ విశ్వాసాన్ని అంధవిశ్వాసంగా మనం భావింపరాదు. ఏలయన - 'యస్మిన్ వేదా నిహితా విశ్వరూపాః' (అథ. 4-35-6) అను వేదమంత్రంలో 'పరమేశ్వరునియందు సమస్త విద్యలకాకరమగు వేదములున్నట్లుగా' - వర్ణన కన్పిస్తుంది.

అంతేగాదు. అనగా వేదము లపౌరుషేయములు : ఇతరములు కావు. అనెడి వైదికుల యీ విశ్వాసం శబ్దప్రమాణం మీదనే ఆధారపడిలేదు. మిక్కిలి తర్కసంగతమైకూడ ఉన్నది. ఎట్లన :

చూడండి : వేదముల అపౌరుషేయత్వ విచారణలో మనకొక ప్రశ్న యెదురౌతుంది. ఏమన - వేర్వేరు మతములవారందరు తమతమ ధర్మ గ్రంథములను ఈశ్వరీయ (భగవంతుని) జ్ఞానంగా విశ్వసిస్తారు. ప్రచారం చేస్తున్నారు. ఈస్థితిలో ఎవరిది ఈశ్వరీయజ్ఞానం? ఎవరిది కాదు? అనేది ప్రశ్న. కాన దానికి జవాబు ఇచ్చుటలో మన మొక ఒరపిడిరాయి - పరీక్షావిధానం - ఏర్పరచుకొనక తప్పదు.

ఆ ఒరపిడిరాయి - పరీక్షావిధానం ఏమిటి? ఎట్లు? అంటారా?

(1) ఈశ్వరీయజ్ఞానం మానవసృష్టితో పాటు సృష్టి ఆరంభంలోనే ప్రకటన కావాలి.

(2) ఈశ్వరీయజ్ఞానం ఏ ఒక దేశభాషలోను ఉండరాదు.

(3) అందు చారిత్రక విషయా లుండరాదు.

(4) సృష్టిక్రమానికి విరుద్ధమగు విషయా లుండరాదు.

(5) అది ఈశ్వరుని గుణకర్మస్వభావములకు అనుకూలంగా ఉండాలి.

ఈ పరీక్షలకు ఏది నిలబడుతుందో అది సృష్టిస్థితిలయకారకుడైన పరమేశ్వరుని జ్ఞానం అవుతుంది. ఇట్లు పరిశీలిస్తే ఏమత గ్రంథమూ ఈ పరీక్షలకు నిలబడదని సులభంగానే తెలుస్తుంది. వేద మొక్కటే యీ పరీక్షలకు నిలబడుతుంది. కాన అదియే ఈశ్వరీయజ్ఞానంగా - అపౌరుషేయంగా - బోధపడుతుంది. కాన వైదికులవిశ్వాసం హేతుబద్ధంగా కూడ ఉందనుటలో సందేహింపవలసిన పనిలేదు.

వేదభాషయు ఈశ్వరీయం

ఇట మరొక విషయం కూడ గమనింపవలసి యున్నది. ఏమన - వేదమనగా జ్ఞానమని యర్థం. అంతేగాదు. జ్ఞానబోధకమగు భాషకూడ వేదశబ్దముచే గ్రహింపబడుతుంది. అట్లు గ్రహించుచో జ్ఞానం, తద్బోధకమగు భాషరెండూ ఈశ్వరీయములు - ఈశ్వరునిచే ఒసంగబడినవి - అని తేలుతుంది. చూడండి :

జ్ఞానము నితరులకు వ్యక్తపరుపవలెనన్న భాష అవసరం గదా! భాష లేకుండ భావ మితరులకు వ్యక్తపరపజాలం. అందువల్ల జ్ఞానంతో పాటు తద్బోధకమగు భాష-శబ్దం- కూడ ఈశ్వరీయం అవుతుంది. కావుననే సత్యవిద్య (జ్ఞానము) లకు ఆదిమూలము - ముఖ్యాశ్రయం - పరమేశ్వరు డని మొదటి నియమంలో చెప్పి, మూడవ నియమంలో సత్యవిద్యల గ్రంథం వేదమని చెప్పబడ్డది. గ్రంథమనగా వాచ్యవాచకసంబంధంతో భావము - భాష కలదియే గదా! కావున నిట వేదశబ్దంచే జ్ఞానం, తద్బోధకమగు శబ్దం - భాష రెండూ గ్రహింపబడుతవి. ఇట్లు జ్ఞానం, తద్బోధకమగు శబ్దజాలం (భాష) ఈశ్వరీయములని గ్రహించాలి.

ఇట్లు భాషాభావములతో కూడిన వేదము ఈశ్వరీయమై సృష్ట్యాదిని మానవమస్తిష్కమునకు మొదటి ప్రకాశము ఒసంగినదిగా గ్రహించాలి.

అయితే ఇతరులు కొందరు - పాశ్చాత్యపండితులు అంత ప్రాచీనంగా వేదముల నంగీకరింపక పోవచ్చు. అయినా వాఙ్మయసృష్టిలో ఋగ్వేదము నాది గ్రంథంగా మాత్రం వారు అంగీకరిస్తున్నారు. అందులో సందేహించుటలేదు. అందువల్ల మానవమస్తిష్కమునకు వేదం తొలి ప్రకాశం ఒసంగిన దనుటలో ఎవ్వరూ వ్యతిరేకింప బనిలేదు.

**వేదం జ్ఞానమయం**

వేదములందలి శబ్దములు యౌగికములు. అనగా గుణవాచకము లన్నమాట. రూఢిశబ్దములు కావు. వేదశబ్దములను గ్రహించియే భౌతిక పదార్థములకు మానవాది ప్రాణులకును నామకరణ మొనర్చినట్లు స్మృత్యాది గ్రంథములు పేర్కొనుచున్నవి.

"సర్వేషాం తు స నామాని కర్మాణి చ పృథక్ పృథక్ ।
వేద శబ్దేభ్య ఏవాదౌ పృథక్ సంస్థాశ్చ నిర్మమే ॥ (మను. 1-21)

అందువల్ల చరిత్రప్రసిద్ధి కెక్కిన అంబ, అంబిక, అంబాలిక, ఇంద్ర, వరుణ, వసిష్ఠ, విశ్వమిత్రాది రూఢినామములు వేదాలలో కనబడినంత మాత్రాన ఆయా వ్యక్తుల చరిత్రలు వానియందున్నట్లు భావింపరాదు. అట్లు భావించుచో ఆయావ్యక్తుల జన్మలతరువాతనే వేదా లుద్భవించినట్లు తేలుతుంది. నిత్యమైన పరమేశ్వరుని జ్ఞానమందు చారిత్రకవిషయము లుండుట అసంభవము. వేదము జ్ఞానమయము, కాని కథల సంపుటి గాదు.

సమస్త సత్యవిద్యలు వేదాలలో బీజరూపంలో ఉన్నవి. ఎట్లనగా - 'భస్మాంతగ్ం శరీరమ్' అని యజుర్వేదము చెప్పుచున్నది. శరీరము భస్మముతో నంతమగునని దానియర్థము. అయితే యీ శరీరమును భస్మము చేయడం ఎట్లా? బీజరూపంలో ఉన్న యీ ప్రబోధాన్ని మహర్షులు తరచి తరచి - "శ్మశాన ప్రదేశము నొకదానిని ఏర్పాటు చేసి ఆయా కాష్ఠముల పేర్చి హవ్యముతో, ఘృతముతో ఆహుతులు వేయుచు అందు (ఇతర ప్రాణులకు అపకారం చేయకుండ) శవాన్ని వేదమంత్రాలతో యజ్ఞరూపంలో దహనం చేయా"లని విధానము నేర్పరచారు. అందువల్లనే యీ సంస్కారానికి అంత్యేష్టి, నరమేధము అని పేరుపెట్టారు.

ఇట్లే వైద్యము, విజ్ఞానము, వ్యాకరణము, ఛందస్సు, గణితము, జ్యోతిషము, విద్యుత్తు మొదలయినవానికి సంబంధించిన విద్యలు బీజ రూపంలో ఉండుటచే ఆయా మహర్షులు వేదమంత్రాలను మధించి వివిధ సత్యవిద్యలను ప్రకటించారు. అవియే ఉపవేదములు, వేదాంగములు, ఉపాంగములు, బ్రాహ్మణములు, ఆరణ్యకములు మొదలయిన పేర్లతో ప్రఖ్యాతి చెందియున్నవి. విద్వాంసులు వానిసాహాయ్యముతో వేదాలను అర్థం చేసుకొనడానికి ప్రయత్నించాలి.

వేదాలకు వ్యాఖ్యానములుగా వెలసిన యీ ఆర్షగ్రంథముల సాహాయ్యం లేకుండ మనం వేదమంత్రాలకు అర్థం చెప్పడానికి పూనుకుంటే చాల ప్రమాదము లేర్పడతవి. అతిప్రసంగమైనా సందర్భము వచ్చినది గనుక మచ్చున కొక్క ఉదాహరణం చెప్పి యీ విషయం విరమిస్తా.

"న త స్య ప్రతిమా అస్తి" (యజు. 32-3) అను మంత్రభాగానికి పండితులు కొందరు " నతస్య=భక్తులచే నమస్కరింపబడు భగవంతునికి. ప్రతిమా= ప్రతికృతి-బొమ్మ-విగ్రహము, అస్తి=కలదు" అని యర్థం చెప్పి విగ్రహారాధన వేదసమ్మతమని చెప్పుటకు పూనుకొంటారు. అయితే 'నతస్య' అను మాటను రెండుపదాలుగా (న, తస్య) విడదీసి అర్థం చెప్పితే "తస్య=ఆ భగవంతునికి, ప్రతిమా=బొమ్మ, న+అస్తి=లేదు" అనగా విగ్రహారాధన వేదసమ్మతం కాదు. అని తేలుతుంది. చూడండి, పరస్పరం ఎంత విరుద్ధంగా ఈ అర్థాలు ఉన్నవో! ఈ రెండర్థాలలో ఏది సరియైనది? ఏది కాదు?

ఈ సందర్భంలో విగ్రహారాధకులయిన ఆ పండితులు తమ వాదానికి బలంగా 'నతస్య'=వేర్వేరు పదాలుకావని ఒకే పదమని, ఎందుకంటే వేదంలో సంహితాపాఠమునకు పదపాఠముకంటె నధిక ప్రామాణ్యం కలదని కారణం చెప్పుతుంటారు. ఉదాహరణలు కూడ చూపిస్తారు. కావున వీరి వాదనను బట్టి నిరాకారుడైన భగవంతునికి ప్రతిమ కల్పించి పూజింపవచ్చునని తేలుతుంది.

ఇది వైదికులకు సమ్మతం కాదు. ఏలయన - స్వరశాస్త్రం సంగతి తెలిసిగాని, తెలియకగాని పౌరాణిక పండితులు ఎత్తుకోరు. ఎత్తుకుంటే తమ వాదం నిలబడదు. ఎట్లనగా - "నతస్య" పదంలో నకారం మీది 'అ'కారం

ఉదాత్తము. 'త' కారం మీది 'అ'కారం కూడ ఉదాత్తమే. స్వరశాస్త్రాన్ని బట్టి చూచినచో ఒకేపదంలో రెండు ఉదాత్తస్వరాలు ఉండకూడదు. కనుక 'నతస్య' ఒకేపదం కాదని, 'న' పదం వేరు, 'తస్య' పదం వేరు అని స్వరశాస్త్రాన్ని బట్టి నిర్ణయమౌతుంది.

కాబట్టి భగవంతునికి ప్రతిమ లేదను నర్థమే సరియైనదిగా స్వరశాస్త్రాన్ని బట్టి వైదికులు నిర్ణయిస్తారు.

అందువల్ల వేదాంగము లయిన శిక్షా వ్యాకరణాదుల సాహాయ్యంతో వేద మంత్రముల నర్థం చేసుకోడానికి ప్రయత్నించాలని చెప్పుకొన్నాం. ఇంకను ఋగ్వేదాదిభాష్యభూమికలో బ్రహ్మవిద్యావిషయవర్ణనకు ఉపక్రమిస్తూ మహర్షి - వేదములందు సర్వవిద్యలు ఉన్నవా? లేవా? అని ప్రశ్నించుకొని "మూలరూపమున నన్నియు నున్నవి. ప్రపంచమున గల సత్యవిద్యలన్నియు వేదములనుండియే వెలువడినవి." అని వ్రాశారు.

మరియు వేదవిషయవిచారం చేస్తూ మహర్షి - ఆ ఋ. భా. భూమిక లోనే వ్రాస్తారు. ఏమని?

వేదములం దనేకవిషయము లున్నవి. కాని ముఖ్యముగా వానిని నాల్గు విధాలుగా విభజింపవచ్చును. 1. విజ్ఞానము, 2. కర్మము, 3. ఉపాసన, 4. జ్ఞానము అని. అనగా నాల్గు వేదాలలోని విషయాలను ఇట్లు నాల్గువిధాలుగా విభజింపవచ్చు నన్నమాట. ఋగ్వేదము జ్ఞానకాండకు, యజుర్వేదము కర్మకాండకు, సామవేదము ఉపాసనాకాండకు, అథర్వవేదము విజ్ఞానకాండకు సంబంధించి యున్నట్లు గ్రహించాలి.

అంతేగాదు. "వేదములందు పరా, అపరా యని పేర్లుగల రెండు విద్యలున్నవి. పృథివి మొదలు ప్రకృతి పర్యంతము గల పదార్థముల యొక్క గుణదోషములను దెలుసుకొని వానితో సిద్ధమగు కార్యములను నిర్వహించుటను నేర్పునది 'అపరావిద్య' యనబడుతుంది. సర్వశక్తిమంతుడగు పరమేశ్వరుని యథార్థజ్ఞానం కలిగించునది 'పరావిద్య' యనబడుతుంది. ఇది అపరావిద్యకంటె మిక్కిలి ఉత్తమము. అపరావిద్యవల్ల ఏర్పడు ఉత్తమఫలమే పరావిద్య అవుతుంది." అని మహర్షి వేదవిషయాన్ని వివరిస్తారు.

ఇట్లు మనుష్యులయొక్క వైయక్తిక, పారివారిక, సామాజిక కర్తవ్యముల యుపదేశం వేదాలలో కలదు. స్వవిషయములో పరుల విషయములో, ఈశ్వరునివిషయములో మానవుని కర్తవ్యాలను గురించి వేదములందు విశేషముగా వర్ణనలున్నవి. వేదము సమస్తసత్యవిద్యల గ్రంథమనుటకు ప్రమాణములు :

(1) 'సర్వజ్ఞానమయో హి సః (మను. 2-7)
వేదము సమస్త సత్యవిద్యల కాకరము.

(2) 'భూతం భవ్యం భవిష్యం చ సర్వం వేదా త్ప్రసిధ్యతి ' (12-67)
భూతవర్తమానభవిష్యత్తులకు చెందిన సకలవిషయముల బీజములు వేదమం దున్నవి.

ఇట్లే బ్రాహ్మణములు, ఉపనిషత్తులు, స్మృతులు, శ్రౌతసూత్రములు పరికించుచో ఋషులెల్లరు వేదమును జ్ఞానమయంగా ఎంచినట్లు కనబడుతుంది.

కాన ఆర్యుడైనవాడు ఈశ్వరీయమైన వేదాన్ని సమస్త సత్యవిద్యల గ్రంథంగా మొదట విశ్వసించాలి.

**ఈ నియమరచనకు ఆధారమగు మంత్రం**

ఇక ఈ నియమంలో రెండవభాగం - 'వేదమును చదువుట - చదివించుట, వినుట - వినిపించుట ఆర్యులకందరికి పరమధర్మము' - అనునది.

ఈ భాగాన్ని అర్థం చేసుకోడానికి ముందు పాఠకు లొకమాటు వెనుదిరిగి యీ నియమ వ్యాఖ్యానానికి ఆదిని పీఠికారూపంలో వివరించిన దేశకాల పరిస్థితుల విషయాలను స్మృతిపథంలోనికి తెచ్చుకోవడం అవసరం. ఏమన : ఈ నియమార్థాన్ని సాధించుటకై మానవమాత్రునికి మహర్షి యొక వెలుగుబాటను చూపించారు. అజ్ఞానాంధకారంలో ఉన్న ప్రజలకు జ్ఞానసూర్యుని ప్రకాశం కలిగించారు. మహర్షి రంగంలో ప్రవేశించడానికి ముందు మానవులందరికి వేదం చదివే అధికారం - అర్హత లేకుండెను. జన్మగత బ్రాహ్మణులకే అది పరిమితమై యుండెను. ద్విజు లనబడే క్షత్రియులకు,

వైశ్యులకు నామమాత్రంగా ఉండెను. ఇక శూద్రులను, అన్ని వర్ణముల స్త్రీలను ఒకే శ్రేణిలో చేర్చి వేదవిజ్ఞానంనుండి వంచించడం జరిగింది. బ్రహ్మసూత్రములకు శ్రీశంకరభగవత్పాదులు వ్రాసిన భాష్యంలో 'అపశూద్రాధికరణం' చూచిన ఆ ఘోరం అర్థం కాగలదు. శ్రీశంకరులవారే కాదు ; వారి ననుసరించిన శ్రీరామానుజ, మధ్వ, వల్లభాద్యాచార్యులందరు ఆ సాహసానికి ఒడిగట్టారు. ఇట్లు వేలకొలది సంవత్సరాలు మోసంతో గడచినవి.

ఈ పరిస్థితి - అన్యాయం మహర్షి దయానందసరస్వతి చూచారు. తనయభిప్రాయాలను సత్యార్థప్రకాశం తృతీయసముల్లాసంలో స్పష్టంగా యుక్తి ప్రమాణాలతో వెల్లడించారు. వేదాధ్యనం లేనందున దేశం ఎట్లు ధర్మభ్రష్ట మైనదో, పతనమైనదో - వేదాధ్యనంవల్ల ఎట్లు ఉన్నతి నందునో వివరించారు. 'యథేమాం వాచం కల్యాణీ మావదాని జనేభ్యః' - ఇత్యాది వేదమంత్రంతో మానవమాత్రునికి వేద+అధ్యయనాధికారం ఉందని ఋజువుచేశారు. ఆ యభిప్రాయాన్ని మనసులో పెట్టుకొనియే యీ మూడవనియమంలోని రెండవ భాగాన్ని 'వేదమును చదువుట - చదివించుట, వినుట - వినిపించుట' అను భాగాన్ని రచించారు.

**వేద ప్రచారానికి సులభమార్గం**

ఇట రెండు విషయాలు గమనింపవలసియున్నది. ఒకటి - ఆర్యసమాజ సభ్యుల కర్తవ్యము ఇబ్బడిగా ఉన్నది. ఏమంటే - వేదం తాము చదువుటతో చాలదు. ఇతరులనుకూడ చదివించాలి. అంటే ఇతరులకు బోధించాలి. అయినా అంతటితో చాలదు. పఠన-పాఠనములతో పాటు శ్రవణ - శ్రావణములు కూడ చేయాలి. ఎందుకంటే : ఒకవ్యక్తి - సభ్యుడు వేదం చదువలేకపోవచ్చు. అప్పుడతడు ఇతరులను కూడ చదివింపజాలడు. కాని అతడు ఇతరులనుండి వినగలడు. విన్నది యితరులకు వినిపింపగలడు. ఈ విధంగా కార్యక్రమము సాగితే మిక్కిలి సులభంగా వేదప్రచారం - ధర్మప్రచారం ప్రజలలో వ్యాపిస్తుంది.

**ఆర్యుల పరమధర్మం :**

ఇక రెండవది - వేదం యొక్క పఠన పాఠనములు, శ్రవణశ్రావణములు ఆర్యులకు - ఆర్యసమాజ సభ్యులకు కేవలధర్మముగా చెప్పబడలేదు. పరమ

- ముఖ్య - ధర్మము (కర్తవ్యము) గా చెప్పబడినవి. లోకములో ముఖ్యధర్మము ఒకటి యుండగా దాని కంగభూతములై గౌణధర్మము లనేకం ఉంటవి. ఆర్యులకు పరమ - ముఖ్యధర్మము వేదము చదువుట -చదివించుట, వినుట - వినిపించుట. ఇక మిగిలిన శమ, దమ, పరోపకారాదులు అన్నియు గౌణము లయి పరమధర్మమునకు సాధనములుగా ఉంటవి. ఈ గౌణధర్మములు అవైదిక ధర్మానుయాయులలో కూడ ఉండవచ్చు. అంతేగాదు. నాస్తికులలోను ఉండవచ్చు. అందువల్ల ఇవి సాధారణధర్మములై ఆర్యధర్మమును వేరుచేయ జాలవు. ఎట్లంటే :

పృథివ్యాది పంచభూతములలో ఉండే జడత్వాదులు సాధారణ ధర్మములు. అవి వానిని (పృథివ్యాదులను)పరస్పరం వేరుచేయజాలవు. కాని గంధాదులు విశేషధర్మములు. అవి పంచభూతములను పరస్పరము వేరుచేస్తున్నవి. పృథివి జడము. అగ్ని జడము. కాన జడత్వగుణము ఆ రెండు భూతములను వేరుచేయుట లేదు. కాని గంధము పృథివికి సహజ - విశేష-గుణము. ఔష్ణ్యము అగ్నికి సహజ - విశేషగుణము. గంధగుణము అగ్నిలో ఉండదు. ఔష్ణ్యము పృథివిలో ఉండదు. కాన ఈ విశేషగుణములు - ధర్మములు - పృథివ్యగ్నులను పరస్పరం వేరుచేస్తున్నవి. అట్లే -

వేదాధ్యయనాదులు ఆర్యులలో నుండు విశేషధర్మములు. అవి ఇతరులనుండి ఆర్యులను వేరుచేస్తున్నవి. అనగా ఆర్యుల విశిష్టతను తెలియ జేస్తున్నవి. కాన ఆర్యులందరు - ఆర్యులు కాదలచుకొన్నవారందరు 'వేదపఠన - పాఠనములు, శ్రవణ-శ్రావణములు' అను విశేష ధర్మమును కలిగియుండాలని మూడవనియమంలోని యీ రెండవభాగం శాసిస్తున్నది. ఈ విశిష్టత లేనిచో వారు ఆర్యులు, ఆర్యసమాజసభ్యులు కానేరరు. పనినిబట్టి ప్లీడరు, డాక్టరు, వ్యాపారి, ప్రొఫెసరు మున్నగు పేర్లతో వ్యవహరింపబడవచ్చు. అంతే.

ఇంకొక సంగతి. వేదపఠనపాఠనములు జరగాలంటే వేదం (గ్రంథం) ఉండాలి. దీనినిబట్టి ఆర్యులయిండ్లలో వేదం తప్పక ఉండాలని తేలుతుంది. ఈ విధంగా లేనిచో అతడు ఆర్యసమాజసభ్యుడు అనిపించుకొనుటకు యోగ్యుడు కానేరడు.

ఈ నియమం ఆర్యసమాజానికి ఇతరసాంప్రదాయిక సంఘాల నుండి వేరుపరచు (వ్యావర్తక) గుణంగా ఉన్నది. ఎట్లన - పౌరాణికులయిన హిందువులుగాని, ఇతరమతస్థులయిన ముసల్మానులుగాని, క్రైస్తవులుగాని మున్నగువా రందరికి ఆర్యసామాజికులవలె దేవునియందు విశ్వాసం ఉన్నది. కాని వేదపఠనపాఠనములు, శ్రవణశ్రావణములు కేవలం ఆర్యసమాజ సభ్యులలో మాత్రమే ఉండు విశేషలక్షణము. ఈ విశేషలక్షణము లేనిచో ఆర్యసమాజ స్థాపనకు అవశ్యకతయే లేదు. కాన పదినియమాలలో ఇయ్యది సారభూత మైనది.

ఒకే ధర్మగ్రంథము

ఇంకను ఈ నియమాన్ని రచించుటలో మహర్షి యొక్క నిగూఢాభిప్రాయమును మనము పరిశీలింపవలసియున్నది. ఏమంటే : హిందూ జాతికంతకూ వేదమే యాధారము - ధర్మగ్రంథము. పురాణాలు గాని, భగవద్గీతగాని, రామాయణముగాని అన్నియు వేదాలనుగురించి పెద్దగా గానము చేస్తున్నవి. కాని హిందువులు మాత్రము వేదాలను బొత్తిగా విడిచిపెట్టారు. అయితే వాటిమీద వారికి భక్తి - శ్రద్ధలు లే వందామా? అట్లు అనడానికి వీలులేదు. నేటికిని హిందువులకు వాటిమీద ఎంతో భక్తి, శ్రద్ధ లున్నవి. మరి యేల వారు వాటిని విడిచిపెట్టారు ? అంటే - మధ్యకాలంలో వ్యక్తిగతములయిన నానామతములు వెలసి ప్రజలకు వేదాలను దూరము చేసినట్లు; వేదధర్మాలనే తాము ప్రచారము చేస్తున్నట్లుగా నమ్మించి వంచనతో మతకర్తలు వేర్వేరు మార్గాలలో ప్రజలను (హిందువులను) నడిపినట్లు ; దాని ఫలితంగానే హిందూ జాతి నానాదేవతలతో, నానామతములతో, నానామతగ్రంథములతో ఛిన్నాభిన్నంగా ఉన్నట్లు ; మూలధర్మగ్రంథం - వేదం - ప్రచారంలో లేకుండా మరుగున బడినట్లు పూర్వం చెప్పకొనియేయున్నాం. మరల చెప్పనక్కరలేదు.

కాబట్టి యీ దుస్థితి - అనైక్యత - తొలగి మరల హిందూజాతి **యంతయు ఒకటి కావాలంటే ఒక త్రాటిమీద నడవాలంటే వేదములను** పఠింపనారంభించాలి. అట్లగుచో - క్రైస్తవుల వలె, మహమ్మదీయులవలె ఒకే పరమేశ్వరజ్ఞానం కలిగి, అంగీకరించి, ఒకే సూత్రానికి హిందువులందరు

బద్ధులు కాగలరు. ఒక్క బైబిలుమత గ్రంథముతో క్రైస్తవజాతి యంతయు ఉత్తేజిత మగుచున్నది గదా ! ఒక్క కురాను గ్రంథము ముసల్మాను లందరినీ ఏకం చేస్తున్నది గదా! అట్లే వేదం కూడ ప్రచారంలో ఉన్నట్లయితే సకలహిందూ జాతియు వేదము పేరుతో ఏకసూత్రముపై నడవగలదు. సందేహము లేదు. ఈ రహస్యాన్ని గుర్తించినవారు ఒక్క దయానంద మహర్షియే. మహర్షి గనుకనే గుర్తింపగలిగారు. గుర్తించడమే కాదు. తన సత్యార్థప్రకాశము ఏడవ సముల్లాసములో - "ఎవరైనను నీ మతమేమి అని ప్రశ్నించినచో 'నా మతము వేదమతము. వేదములందేమి చెప్పియున్నదో దానినే మే మంగీకరించి యాచరింతుము'. అని సమాధానమీయవలెను." అని లిఖించియున్నారు. అంతేగాదు ఆర్య సమాజనియమములలో "వేదపఠన - పాఠనములు, శ్రవణ - శ్రావణములు ఆర్యుల కందరికి పరమధర్మము" అను నియమాన్ని చేర్చినారు.

కాబట్టి వేదప్రచార మనెడి పరమ (విశేష) ధర్మము, ఈ సమాజము వల్ల నెరవేరకపోతే సమాజకార్యక్రమమంతా వెలుతురు లేని దీపంలాగా నిరర్థకమే అవుతుంది.

శ్రీమద్దయానందసరస్వతి ఋషులకోవకు చెందినవారు. 'ఋషయో మంత్రద్రష్టారః' అనగా ఋషులు మంత్రద్రష్టలుగదా! తరువాతి తరముల వారికి దెలియునిమిత్తం మంత్రార్థముల వివరించుటకే ఋషులు బ్రాహ్మణాది గ్రంథములను - వేదములకు వ్యాఖ్యానభూతములయినవానిని - రచించారు. భోగాపేక్షతో ఐహిక సంపదల నార్జించడానికి గాని కీర్తి నార్జించడానికి గాని వారు రచించలేదు. ప్రాణికోటిని, మానవజాతిని ఉద్ధరించడానికి దేశక్షేమం కోరి నిస్స్వార్థంతో రచించారు. మనుష్యుడు బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ - ఆశ్రమములు మూటిలోను వేదపఠనపాఠనములను, శ్రవణశ్రావణములను మానరాదని మహర్షులు తమ గ్రంథములలో సలహారూపంలో, శాసనరూపంలో సందేశాలు, అదేశాలు ఇచ్చియున్నారు. పరమేశ్వరుడు శ్రుతులలో ఇచ్చిన సందేశాలనే, ఆదేశాలనే మహర్షులు తమస్మృతి గ్రంథాలలో ఇవ్వడం జరిగినది. దిగువ నుదాహరించిన ప్రమాణాలవలన ఈ విషయము బోధపడుతుంది.

**స్వాధ్యాయ ప్రవచనములు**

(వేద) పఠన - పాఠనములన్నా, అధ్యయన - అధ్యాపనములన్నా

చదువుట - చదివించుట అనియే అర్థం. వీనిని మహర్షులపరిభాషలో స్వా (సు+అ+అధ్యాయ) ధ్యాయ ప్రవచనము లంటారు. స్వాధ్యాయమంటే బాగా చదువుట అని యర్థం. ప్రవచనమంటే చదివించుట - బోధించుట అని యర్థం.

ఈ స్వాధ్యాయప్రవచనములకు మహర్షులు చాల ప్రాముఖ్యత నిచ్చారు. ఎట్లన :

"నిత్యం శాస్త్రా ణ్యవేక్షత నిగమాంశ్చైవవైదికాన్" అనగా 'నిత్యం వేదాది సత్యశాస్త్రముల నవలోకిస్తూ ఉండాలి' అని మనుస్మృతి యందు గృహస్థ ధర్మముల బోధించు ప్రకరణంలో మనుమహర్షి ఆదేశించారు.

**" ఋతం చ స్వాధ్యాయప్రవచనే చ । సత్యం చ స్వాధ్యాయ ప్రవచనే చ। తపశ్చ స్వాధ్యాయప్రవచనే చ । .... ప్రజనశ్చ స్వాధ్యాయ ప్రవచనే చ । ప్రజాతిశ్చ స్వాధ్యాయప్రవచనే చ । "**

అనగా 'ఋతసత్యాదులను నిత్యం పాలిస్తూ స్వాధ్యాయప్రవచనములు మాత్రం తప్పక జరపాలి.' అంటే ఏపని చేస్తున్నా వేద - అధ్యయన, అధ్యాపనములు మానక జరుపుతూ ఉండాలి. అని తైత్తిరీయోపనిషత్తు శిక్షావల్లిలో చెప్పబడినది.

దీనిని బట్టి వేదపఠనపాఠనములు నిత్యం అవశ్యకర్తవ్యములుగా మహర్షులు భావించినట్లు కనబడుతున్నది. మరియు పతంజలి మహర్షి స్వాధ్యాయమును యోగాంగములలో రెండవ అంగమైన నియమములలో - వ్యక్తిగత ధర్మములలో - నొకటిగ చేర్చి, "శౌచ సంతోష తపః స్వాధ్యా యేశ్వరప్రణిధానాని నియమాః- (2-32)" అను సూత్రమును రచించారు. అంతేగాదు. స్వాధ్యాయమునకు ఫలం "ఇష్టదేవత -పరమాత్మ-యొక్క ప్రాప్తి' ' అనియు "స్వాధ్యాయాదిష్టదేవతా సంప్రయోగః" (2-44) అను సూత్రంలో తెలియజేశారు. (ఇట మహర్షి పతంజలిదృష్టిలో స్వాధ్యాయ మనగాకేవలం వేద+అధ్యయనమే గాదు. గాయత్రీ మంత్రజపం - ప్రణవజపం కూడ స్వాధ్యాయముక్రిందికి వస్తుంది.

'స్వస్య+అధ్యాయః=స్వాధ్యాయః' అనియు స్వాధ్యాయపదమును

నిష్పన్నం చేయవచ్చు. అప్పుడు తన అధ్యయనము అనగా ఆత్మ - శరీర - ఆదుల తత్త్వజ్ఞానమునకు చేయు ప్రయత్నమని అర్థం లభిస్తుంది. అంటే ఆత్మ విషయక వేదమంత్రముల జపంకూడ స్వాధ్యాయం క్రిందికే వస్తుంది. ఈ అభిప్రాయంతోనే పతంజలి యోగాంగమైన నియమములలో స్వాధ్యాయమును చేర్చినారు. అట్టి స్వాధ్యాయం - మంత్రజపం - వల్ల యోగం - చిత్తవృత్తుల నిరోధం - లభిస్తుంది, అని పతంజలి యొక్క అభిప్రాయము.

అందువల్లనే - 'తపః స్వాధ్యాయేశ్వర ప్రణిధానాని క్రియాయోగః'; 'సమాధిభావనార్థః క్లేశతనూకరణార్థశ్చ' - (యో. ద. సమా. పా. 1-2 సూ)అను సూత్రములలో స్వాధ్యాయమును క్రియాయోగముగ జెప్పి దానివల్ల చిత్తశుద్ధి కలిగి సమాధి లభిస్తుందని పతంజలి తెలియజేశారు.

ఈ విషయాన్నే మహర్షి వేదవ్యాసుడు 1-28 యోగ సూత్ర భాష్యంలో-

**"స్వాధ్యాయాత్ యోగ మాసీత యోగాత్ స్వాధ్యాయ మామనేత్ ।**

స్వాధ్యాయయోగసంపత్త్యా పరమాత్మా ప్రకాశతే ॥ '

అనగా 'స్వాధ్యాయము (ప్రణవజపము) తో యోగం - చిత్తవృత్తుల నిరోధం సంపాదించాలి. దానితో అనగా యోగంతో స్వాధ్యాయం సాగించాలి. అంత స్వాధ్యాయయోగముల సంమిళిత శక్తివలన ఆత్మలో పరమాత్మ స్వయంగా ప్రకాశిస్తాడు. ఇది స్వాధ్యాయంవల్ల కలుగు గొప్ప ఫలం' అని వివరించారు. అందువల్ల ప్రణవాది మంత్రముల జపంకూడ స్వాధ్యాయం క్రిందకే వస్తుందని గ్రహించాలి. )

ఇట్లు శ్రుతిస్మృత్యాది శాస్త్రముల వేదఅధ్యయమునకు ప్రాముఖ్యత నిచ్చి ప్రచార మొనర్ప నాదేశించుచున్నవి.

కావున ఈశ్వరీయవేదమును సత్యవిద్యల గ్రంథముగా విశ్వసించి ప్రచారముచేయుట ఆర్యుల - ఆర్యసమాజ సభ్యుల ముఖ్యధర్మము - కర్తవ్యముగా నీ మూడవ నియమము ప్రబోధించుచున్నది. ఈ నియమమును ఆచరణలో పెట్టనివ్యక్తి ఆర్యసమాజంలో సదస్యుడుగా పరిగణింపబడజాలడు. ఉండుటకు అర్హుడును కాడు.

# నాలుగవ నియమము

అవ॥ వేదము సమస్త సత్యవిద్యల గ్రంథమని, దాని పఠనపాఠనములు, శ్రవణశ్రావణములు ఆర్యులకు పరమధర్మమని - మూడవ నియమంలో గ్రహించిన తరువాత - వేదవిధి ననుసరించి సత్యము గ్రహించుటకు అసత్యము పరిత్యజించుటకు సిద్ధపడాలని చెప్పుటకు ఈ నాల్గవ నియమము రచింపబడినది.

నియమము

" సత్యకే గ్రహణ్ కర్ నే ఔర్ అసత్యకే చోడ్ నే మే సర్వదా ఉద్యత్ రహనా చాహియే"

తా॥ సత్యము గ్రహించుటకును అసత్యము త్యజించుటకును ఎల్లప్పుడు సిద్ధముగా నుండవలెను.

**నియమరచనకు ఆధారమగు మంత్రములు**

అభ్యుదయమును - ఇహపరజన్మల యభివృద్ధిని, నిశ్శ్రేయసమును - మోక్షమును - కోరే వ్యక్తి జీవితమును వ్రతమయంగా గడపాలి. వ్రతాలలో గూడ సత్యవ్రతము ముఖ్యమైనది. అందువల్లనే విద్య నార్జించుటకు గురుకులానికి వెళ్ళిన విద్యార్థులకు పూర్వము - వేదకాలంలో - ఆచార్యుడు ఉపనయన సంస్కారమొనర్చి గాయత్రీ మంత్రంతోపాటు సత్యవ్రతమంత్రాలను ఉపదేశిస్తూ ఉండేవారు.

**సత్యవ్రత మంత్రము**

**"అగ్నే !వ్రతపతే ! వ్రతం చరిష్యామి, తత్తే ప్రబ్రవీమి, తచ్ఛకేయం. తన్మే రాధ్యతాం. ఇద మహ మనృతాత్ సత్య ముపైమి." (యజు. 1-5)**

వ్రతపతివైన ఓ స్వామీ ! నేను వ్రత మాచరింపదలచితిని. దానిని నీకు చెప్పి చేసెదను. దానివలన నభ్యుదయము పొందెదను. దాని నాచరించు శక్తి నా కొసంగుము. ఆవ్రతము అసత్యమును వీడి సత్యమును గ్రహించుటయే.

**సంఘజీవనము**

మనుష్యుడు సంఘజీవి. ఒక్క మనుష్యులేకాదు. సకలజీవులు సంఘ జీవనం కలవిగానే కనబడుచున్నవి. ఏ జీవీ యొంటరిగా జీవిసున్నట్లు కానరాదు.

అయితే పశుపక్ష్యాదులు కేవలం భోగయోనులు కాగా మానవులు మాత్రం ఉభయయోనులు ; అనగా కర్మయోనులు, భోగయోనులు అయియున్నారు. అందువల్ల వర్తమాన మానవదేహంలో ప్రారబ్ధకర్మఫలం అనుభవిస్తూనే క్రొత్త (ఆగామి) కర్మలు చేసే అవకాశం మానవులకు ఉన్నది. పశుపక్ష్యాదులకు ఈ అవకాశం లేదు. కారణం ! మానవులకువలె వానికి జ్ఞానం - మనస్సుతో ఆలోచించుశక్తి - లేదు. అనగా వివేకం లేదు.మననశక్తి ఒక్క మానవులకు మాత్రమే కలదు. దానికితోడు మాటాడుటకు వాగింద్రియం కలదు (చతుర్విధవాక్కులు - పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ.) వైఖరీవాక్కులతో మానవుడు తన యభిప్రాయము నితరులకు చెప్పగలడు. శాస్త్రగ్రంథముల సాహాయ్యంతో తన జ్ఞానం వృద్ధి చేసుకోగలడు.

పరమేశ్వరుడు మానవులకొఱకు వేదము లిచ్చినట్లు చెప్పుకొంటిమి గదా! వేదములలో సమాజజీవనం ఎట్లు ఉండాలో చెప్పబడి ఉన్నది.

(1) "అజ్యేష్ఠాసో అకనిష్ఠాస ఏతే సంభ్రాతరో బభూవుః సౌభాగ్యాయ" (ఋ. 5-60-5)

పుట్టుకతో నెవరికి పెద్దచిన్న వ్యవహారము లేదు. అందరు సోదరుల వలె సమానులే. అందరూ కలిసి సౌభాగ్యం కొఱకు ప్రయత్నించాలి.

(2) "మిత్రస్య చక్షుషా సమీక్షామహే" (యజు. 36-18)

సామాజికభావన సిద్ధించుటకు అందరూ మైత్రితో మెలగుతూ ఉండాలి.

(3) "యస్తు సర్వాణి భూతా న్యాత్మన్నే వానుపశ్యతి" (య. 40-6) తనవలె సర్వభూతములను చూచుకోవాలి.

(4) "పుమాన్ పుమాంసం పరిపాతు విశ్వతః" (ఋ. 6-75-14) మనుష్యులు పరస్పరం ఒకరికొకరు సాహాయ్యం చేసుకోవాలి.

తనది అనుకొన్నది వస్తువుగాని, వ్యవహారం గాని యేదైనా మంచిదిగా - శ్రేష్ఠమైనదిగా కనబడుతుంది; అది చెడ్డదైనాసరే. అంతేగాదు. పరాయిది అనుకొన్నది - వస్తువుగాని, వ్యవహారంగాని చెడ్డదిగా - చులకనగా కనబడుతుంది; అది మంచిదైనాసరే. ఇది లోకసహజం. ఇందు ఆశ్చర్యపడవలసిన దేమిలేదు. లోకంయొక్క తీరే ఇది. అయితే సంఘంలో ఈ రకమైన భావన పెరిగినకొలది

కలహం-అశాంతి యేర్పడుతుంది. తప్పదు. అట్లే జరిగింది కూడ.

అందువల్ల ఆయా సమయాలలో - కాలాలలో విచారశీలురయిన పెద్దలు - ప్రవక్తలు బయలుదేరి సంఘశాంతికి అనేక విధాలుగా పాటుపడినట్లు పూర్వచరిత్రలు చెప్పుచునే ఉన్నవి. అట్లు పాటుపడినవారిలో మహర్షి దయానందసరస్వతి ఒకరు. అయితే వీరు అందరిలాంటివారు కాదు. మహర్షి అనగా తపశ్శక్తితో మంత్రార్థం దర్శింపగలవారు. వేదాలకు భాష్యం వ్రాసినవారు. అందువల్ల శాంతిమయమైన వైదిక సాంఘికజీవనం అశాంతిపాలు కావడానికి కారణం గ్రహించారు. అంత వీరు సంఘశాంతికి, ఐకమత్యానికి ఎవ్వరూ చెప్పలేనిది, శాశ్వతమైనది అయిన ఉపాయం ఒకటి చూపించగలిగారు. ఏమిటి ఆ ఉపాయం? పక్షపాతంగాని, ఆగ్రహం (ద్వేషం)గాని లేకుండ జీవితంలో మానవుడు సత్యాన్ని గ్రహిస్తూ, అసత్యాన్ని పరిత్యజిస్తూ ఉండడమే అది. దానినే యీ నాల్గవ నియమంగా మహర్షి రచించారు.

**మిథ్యారోపణ**

తన అమరగ్రంథమైన సత్యార్థప్రకాశంలోని భూమికలో స్వామీజీ వ్రాస్తారు. ఏమని ?

సత్యమగు నర్థమును ప్రకాశపరచుటయే యీ గ్రంథమును రచించుటలో గల నా ముఖ్యప్రయోజనము. సత్యమును సత్యముగును, మిథ్యను మిథ్యగను ప్రతిపాదించుట సత్యార్థప్రకాశము. పదార్థమును ఉన్నదున్నట్లు చెప్పుటయు, వ్రాయుటయు, నమ్ముటయు సత్యము. పక్షపాతము గలవాడు తన యసత్యమును గూడ సత్యమనియు విరద్ధమతస్థుల సత్యమునుగూడ అసత్యమనియు సిద్ధపరచుటకు యత్నిస్తాడు. కనుక సత్యమును గాంచజాలడు." అని తన సత్యాభిలాషను వెల్లడించారు. అంతే గాదు.

" ఈ గ్రంథమం దెక్కడనేని పొరపాటుచేగాని, ముద్రించుటలో గాని శోధించుటలో గాని తప్పులుండుచో - అవి తెలిసినపుడును తెలుపబడి నపుడును సవరింపబడును" అని వ్రాశారు.

దానినిబట్టి మహర్షి యెంతటి నిష్పక్షపాతియో, సత్యాభిలాషియో, నిరభిమానియో మనకు వ్యక్తం కాగలదు.

ఆయన ఆయా మతములలో నున్న విద్వాంసులకు ఒక సలహాకూడ ఇచ్చియున్నారు. ఏమంటే - "ఆయా మతములలోని విద్వాంసులు పక్షపాతము విడిచి సర్వతంత్రసిద్ధాంతమును, అనగా అందరికి అనుకూలమైయుండు సత్యమును - గ్రహించి పరస్పరవిరుద్ధములగు వానిని త్యజించి అన్యోన్య ప్రీతితో వర్తిల్లుచు నందరి నట్లే వర్తింపజేయుచో జగత్తునకు సంపూర్ణహిత మొనగూడగలదు" అని.

ఇంకను 'విద్వాంసులయందలి విరోధముచేతనే మూఢులయందును విరోధము పెరిగి నానావిధదుఃఖము లేర్పడి సుఖ మడుగంటుచున్నదనియు' మహర్షి హెచ్చరించియున్నారు.

సత్యమేవ జయతే నానృతమ్. సత్యేన పంథా వితతో దేవయానః' - అనగా సర్వదా సత్యానికి విజయము, అసత్యానికి పరాజయము; సత్యము చేతనే విద్వాంసులమార్గము విస్తారమగుచున్నది' అను దృఢ నిశ్చయము గలవాడు మహర్షి దయానంద సరస్వతి, అందువల్లనే -

"తన దొక నవీనకల్పన గాదని, మతమతాంతరముల నేర్పరచు నభిప్రాయం తనకు లేదని, కాని సత్యమైనదాని నంగీకరించుట - అంగీకరింప జేయుట, అసత్యమైనదానిని త్యజించుట - త్యజింపజేయుటయే తన యభీష్టమనియు స్వమంతవ్యామంతవ్య ప్రకాశములో వ్రాసియున్నారు.

కనుక సంఘము - సమాజము - శాంతముగా ఉండాలంటే సమాజంలోని వ్యక్తులు - అనగా సంఘజీవులయిన మానవులు సత్యశీలురై సత్యాచరణకలవారుగా ఉండాలి. అంతకంటె మరొకమార్గం లేనేలేదు. స్వతః ప్రమాణము లయిన వేదాలుగాని, పరతః ప్రమాణములయిన స్మృతులు - ఆర్ష గ్రంథములు గాని ఇట్లే చెప్పుచున్నవి. మహర్షి దానినే స్వీకరించి ఆర్యసమాజ నియమములలో చేర్చినారు.

మహర్షిదయానందసరస్వతి ఋషులకోవకు చెందినవారు. అగుటచే దూరదృష్టితో వేదమతమును, ఋషులమతమును పునరుద్ధరించడానికి పూనుకొన్నారు. అందుకొరకే ఆయన ఆర్యసమాజం స్థాపించారు. దానికి నూరేండ్లు నిండినవి. వేదధర్మాలను, ఋషుల సంప్రదాయాన్ని అది ప్రచారం

చేస్తూ సంఘశాంతికి, మానవోద్ధరణకు పాటుపడుతూ ఉన్నది. ఇంతవరకు దాని కెదురుపడి తమ మతమునుగాని, సంప్రదాయాన్ని గాని సమర్థించుకోగలిగిన సంస్థ యరొకటి పుట్టలేదు. పుట్టబోదు, దానికి కారణం ఒక్కటే. ఆర్య సమాజం సత్యం మీద ఆధారపడ్డది. సత్యం ఎక్కడ ఉన్నా స్వీకరిస్తుంది. అసత్యం ఎక్కడ ఉన్నా అనగా తనలో ఉన్నా పరిత్యజిస్తుంది. ఈ సాహసం చేయగలిగితే దేశంలో ఇన్ని మతాలు, సంప్రదాయాలు ఉండటానికి అస్కారమే లేదు. అప్పుడొక్కటే సత్యమతం - వేదమతం - ఋషుల మతం ఉంటుంది. ఈ విధంగా ఆర్యసమాజంయొక్క గొప్పతనాన్ని, దయానందసరస్వతి యొక్క దూరదృష్టిని మనం అర్థం చేసుకోడానికి ప్రయత్నించాలి

మహర్షి దయానందసరస్వతి చూపెట్టిన మార్గం చేపట్టియే మో. దా. కరంచంద్ గాంధి మహాత్ముడై దేశదాస్యం తొలగింపగలిగారు. కాని భావదాస్యం మాత్రం ఇంకా పోలేదు. అది పోవాలంటే వేదప్రచారం విరివిగా జరగాలి. అందుకే ఆర్యసమాజం ఏర్పడినది. పనిచేస్తున్నది. భవతు.

సత్యా సత్యముల యర్థ వివరణ

ఇక ఈ నియమంలోని సత్యాసత్యపదాలయొక్క అర్థాన్ని గురించి పరిశీలింపవలసియున్నది.

లోకంలో సాధారణంగా ఏవస్తువు ఎట్లా ఉన్నదో దాని నట్లాగే తెలుసుకోవడం సత్యం అనబడుతుంది. కాని అది సత్యపదానికి సంపూర్ణమయిన అర్థంకాదు; వివరణ కాదు. ఎందుకంటే పలుసమయాలలో కొందొక వస్తువును గురించి తెలుసుకుంటాం. అయినా దానిని గురించి యితరులతో చెప్పేటప్పుడు కొంత పెంచియో, తగ్గించియో చెప్పడం జరుగుతుంది. అంతేగాదు. ఒకడు కొందొక వస్తువునో విషయాన్నో ఉన్నది ఉన్నట్లే తెలుసుకుంటాడు. చెప్పుతూకూడ ఉంటాడు. కాని ఆచరణలో దానిని పాటించడం జరుగదు. ఎట్లంటారా? చూడండి :

'వేదం సమస్తసత్యవిద్యల గ్రంథము. దానిని చదువుట-చదివించుట, వినుట - వినిపించుట ఆర్యుల కందరికి పరమధర్మము-' అను నియమాన్ని ఒకవ్యక్తి తెలుసుకున్నాడు. దాని అర్థాన్ని ఇతరులకు వివరించి చెప్పుతూ కూడ

ఉంటాడు. కాని ఆచరణలో మాత్రం పెట్టడం లేదు ; అనుకోండి. అప్పుడా వ్యక్తిని సత్యవాది అనగలమా? అనజాలం. కాబట్టి సత్యపదానికి సంపూర్ణంగా అర్థం వివరించాలంటే - మనస్సులో ఏది సంకల్పిస్తే దానినే మాటలలో చెప్పాలి. మాటలలో చెప్పినట్లే క్రియలలో ఆచరించాలి. అదియే సత్యం అనబడుతుంది. అప్పుడే సత్ఫలితం లభిస్తుంది. అందుకనే మహర్షులు -

**'య న్మనస్మా ధ్యాయతి తద్ వాచా వదతి. య ద్వాచా వదతి తత్కర్మణా కరోతి. య త్కర్మణా కరోతి త దభి సంపద్యతే.'** అనగా -

'మనుష్యుడు ఎట్లు సంకల్పించునో అట్లే వాక్కుతో చెప్పును. ఎట్లువాక్కుతో చెప్పునో అట్లే కర్మతో చేయును. ఎట్లు కర్మతో చేయునో అట్టి ఫలితము పొందును'. అని చెప్పడం జరిగింది.

కాబట్టి త్రికరణములతో చేసేపని ఒకేతీరులో ఉన్నప్పుడే సత్యం అనిపించుకొంటుందని, దానికే సత్ఫలితం లభిస్తుందని గ్రహించాలి .

అట్లుగాక మనసులో సంకల్పం ఒకటి కాగా మాటలలోని తీరుగాని, క్రియలలోని తీరుగాని మరొకటిగా ఉంటే అది మిథ్య - అసత్యం అనబడుతుంది. సత్యం త్రికాలాబాధ్యం గదా! అనగా ఎప్పుడూ (త్రికాలములలో) ఒకటిగానే సత్యం ఉండాలి. సంకల్పించేటప్పుడు విషయం కొండొకవిధంగా ఉండి చెప్పేటప్పుడు గాని చేసేటప్పుడు (ఆచరణలో) గాని మరొకవిధంగా ఉంటే - మారితే - అది త్రికాలాబాధ్యం ఎట్లా అవుతుంది? సత్యం ఎట్లా అనబడుతుంది? కాబట్టి ఉన్న దున్నట్లు తెలుసుకోవడమే సత్యం అని చెప్పితే చాలదు. మరి మానసికభావన మార్పులు చెందక క్రియారూపం దాల్చినప్పుడే సత్యం అవుతుంది. అప్పుడే తగినఫలితం లభిస్తుంది.

**రాజకీయరంగమున సత్యనిర్ణయం**

ఇక రాజకీయరంగంలో ప్రజాస్వామ్యం పేరుతో సత్యాసత్యనిర్ణయం ఒక వింతపద్ధతిలో జరుగుతూ ఉన్నది. ఎట్లంటారా? నూరుమందిలో ఏబదియొక్కమంది అభిప్రాయం ఒకటిగా ఉండి, నలుబది తొమ్మిదిమంది అభిప్రాయం దానికి భిన్నంగా ఉంటే మొదటివారి అభిప్రాయమే సంఖ్యాధిక్యతను బట్టి పాటింపబడుతుంది. సత్యంగా - ధర్మంగా స్వీకరింపబడుతుంది. ఈ

పద్ధతి ఆర్యసమాజానికి ఆదరణీయంకాదు. ఎందుకంటే - అధికసంఖ్యాకులు గదా! అని నూరుగురు మూర్ఖులమాటను పాటించి పదుగురు విద్వాంసుల మాటను త్రోసిపుచ్చితే సత్యం, న్యాయం, నీతి అడుగంటుతుంది. చూడండి:

వైజ్ఞానికు లొకరిద్దరు పరిశోధనలు చేసి భూమికి ఆకర్షణశక్తి ఉన్నదని నిర్ణయిస్తే వందమంది అజ్ఞానులు దానిని కాదనవచ్చు. అంతమాత్రాన వైజ్ఞానికులు తమ సిద్ధాంతం మార్చుకొనడం జరుగుతుందా? ఒక వేళ అట్లు మార్చుకొనడమే జరిగితే వైజ్ఞానిక పరిశోధనలు పరిహాసపాత్రములు కాకమానవు.

సరే. కాని, ఆర్యసమాజంకూడ రిజిష్టర్డు సంస్థగదా! అందు అధిక సంఖ్యాకుల యామోదంతో విషయం నిర్ణయింపబడదా? అని ప్రశ్నకలుగు వచ్చు. నిజమే. కాలానుగుణంగా నియమోపనియమాలతో ఆర్యసమాజం కూడ రిజిష్టర్డు చేయబడినది. అయితే ఆర్యసభా సదస్యులు రెండుమూడు రకాలుగా ఉంటారు. అందు సదాచార సంపన్నులయి కొన్ని ప్రత్యేకార్హతలు గల ఆర్యసభాసదస్యులకే విషయనిర్ణయంలో అధికారం ఉంటుంది. అందువలన అసత్య నిర్ణయానికి అవకాశం ఉండదు.

### సత్యాసత్యనిర్ణయానికి చర్చలు

అయితే ఇట్టి స్థితిలో సత్యాసత్యనిర్ణయానికి ఏదేని సరళమార్గం ఒకటి ఆలోచింపవలసియున్నది. మనుష్యులు సామాజిక జీవులు అని ప్రారంభంలో చెప్పుకొన్నాంగదా! కనుక సమాజంలో ఉంటూనే మనుష్యులు పరస్పరం భావాలు - ఆలోచనలు వెల్లడించుకొంటూ తమతమ జ్ఞానాన్ని అభివృద్ధి పరచుకోవడం జరుగుతూ ఉంటుంది. అనగా వ్యక్తి సమాజంనుండి కొంత నేర్చుకోవడం జరిగితే, మరి తాను సమాజానికి కొంత నేర్పడం జరుగుతూ ఉంటుంది. కనుక సంఘంలో జరుపుతూ ఉండే - 'శంకా సమాధానాలు, వాద ప్రతివాదాలు, శాస్త్ర చర్చలు' - మొదలయినవి జ్ఞానాభివృద్ధికి - సత్యనిర్ణయానికి ఎంతో సహకారులు అవుతూ ఉంటవి. అయితే - "పక్షపాతరహితంగా మైత్రితో ఆ చర్చలు జరగాలి. వాదిప్రతివాదులు పట్టుదలవీడి సత్యం గ్రహించుటకు, అసత్యం త్యజించుటకు సిద్ధపడాలి. అప్పుడే సత్య నిర్ణయ మౌతుంది. అట్లుగాక పక్షపాతంతో ఒకడు తన అసత్యాన్ని కూడ సత్యమని పరులసత్యాన్ని

కూడ అసత్యమని సిద్ధపరచుటకు యత్నిస్తే (పూనుకుంటే) అట్టివాడు సత్యమతమును గాంచజాలడు." అని స్వామీజీ అభిప్రాయం.

**అయిదు విధముల పరీక్షావిధానము**

ఇట్లు సత్యనిర్ణయానికి ఎంతో జాగురూకత వహించి ప్రయత్నించి నప్పటికిని కొన్నికొన్ని సమయాలలో సఫలత కలుగకపోవచ్చు. అందుకనే మహర్షి దయానందసరస్వతి దీర్ఘంగా ఆలోచించి సత్యమును పరీక్షించుటకు అయిదుపద్ధతులను తన సత్యార్థప్రకాశం మూడవసముల్లాసంలో సూచించారు. ఎట్లన

1. ఈశ్వరుని గుణకర్మస్వభావములకును, వేదమునకును అనుకూల మైనది సత్యం. వీనికి విరుద్ధమైనది అసత్యం.

2. సృష్టిక్రమమునకు అనుకూలమైనది సత్యం. దానికి విరుద్ధమైనది అసత్యం. ఎట్లన - తల్లిదండ్రుల సంయోగము లేక కుమారుడు పుట్టెనని ఎవరైన చెప్పుచో అది సృష్టిక్రమమునకు విరుద్ధమగుటచే నసత్యం.

3. ఆప్తులయు, ధార్మికులయు, విద్వాంసులయు, సత్యవాదులయు, నిష్కపటులయు సాంగత్యమునకు, ఉపదేశములకు ననుకూలమైనది గ్రాహ్యం. విరుద్ధమైనది అగ్రాహ్యం.

4. తన యాత్మ పవిత్రతకు, విద్యకును అనుకూలమైనది అనగా తన కెట్లు సుఖము ప్రియము, దుఃఖము అప్రియమునగునో అట్లే సర్వత్ర యెరుగవలెను. అనగా తా నితరులకు దుఃఖముగాని సుఖముగాని కలిగించుచో వారు అప్రసన్నులు, ప్రసన్నులు నగుదురని తెలియవలెను.

5. ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దము, ఐతిహ్యము, అర్థాపత్తి, సంభవము, అభావము - అను ప్రమాణములచే నిర్ణయింపబడునది సత్యము. అట్లు కానిది అసత్యము.

**ఈ అయిదు విధములయిన పరీక్షావిధానాలతో పరిశీలించి సత్యాసత్య** నిర్ణయం చేయవచ్చు.

కాబట్టి పై పద్ధతులలో శంకాసమాధానాలు, వాదప్రతివాదాలు, శాస్త్రచర్చలు మొదలయినవి జరుపుచు నిరబిమానంతో నిష్పక్షపాతంతో

సత్యమంగీకరించడానికి, అసత్యం త్రోసిపుచ్చడానికి ఆర్యసమాజసభ్యులు సదా సిద్ధపడాలని యీ నియమం సూచిస్తున్నది.

ఇక నిక్కడ ఆర్యసమాజసభ్యులు ముఖ్యంగా గమనించవలసిన విషయం ఒకటి ఉన్నది. ఏమంటే - సత్యం గ్రహించినా, దానియందు ప్రవృత్తి లేకపోవడం; అసత్యం గ్రహించినా దానినుండి నివృత్తి కలుగక పోవడం సాధారణంగా లోకంలో కనబడుతుంది. కారణం? ఇది చెప్పినంత తేలిక మార్గంకాదు. ఎందుకంటే - మనస్సు పూర్వపు అలవాట్లను వదలిపెట్టడానికి ఇష్టపడదు. పైగా ఈమార్గంలో కొన్ని కష్టములు, నష్టములు పొందవలసి వస్తుంది. అందుకు ఎంతో గుండెనిబ్బరం కావాలి. అదియు నీశ్వర ప్రణిధానంవల్లనే కలుగుతుంది. అందువల్ల సమాజసభ్యులకు దృఢ సంకల్పం, సత్సంగం, స్వాధ్యాయం మరియు నీశ్వర ప్రణిధానం అవసరం. అలసత్వం పనికిరాదు. కనుకనే సత్యవ్రతమంత్రాలలో సత్యాచరణకు తగినశక్తి నిమ్మని భగవంతుని ప్రార్థించడం జరిగింది.

**సత్య మెవరినుండి యైన గ్రహించాలి :**

మొదటి మూడు నియమాలను స్వీకరించినవ్యక్తికి ఈ నాల్గవ నియమం ప్రతిజ్ఞవలే ఉపయోగిస్తుంది. ప్రపంచానికి ఆదిమూలం పరమేశ్వరుడని తలంచి, ఆ పరమేశ్వరుని గుణకర్మస్వభావములు గురుతించి, సత్యవిద్యల గ్రంథమైన వేదమును ఈశ్వరీయముగా విశ్వసించేవారికి ఈ నియమము పాలింప దగియున్నది. ఈ నియమాన్ని పాలించువారు దృఢమైన ధార్మికులు కావాలి. రాగద్వేషాలకు లోనై హఠధర్ములు కారాదు. జాతి, మత, వ్యక్తి, భేదమూలక సంకోచం లేక సత్యం ఎవరినుండియైనా గ్రహించడానికి సిద్ధంగా ఉండాలి. సుభాషితము బాలునినుండి, సద్వృత్తము శత్రువునుండియు గ్రహింప దగునని మనుధర్మశాస్త్రము చెప్పుచునే యున్నది గదా!

కాబట్టి ఈశ్వర ప్రణిధానంతో పైరీతిని అసత్యం వీడి, సత్యం గ్రహిస్తూ జీవితం దిద్దుకొనువాడే బాగుపడతాడు. ఆర్యసభాసదస్యుడు కాగలుగుతాడు. స్వయ మార్యుడుగా మారనిది యితరుల నార్యులుగా మార్చడం అసంభవం.

## అయిదవ నియమము

అవ॥ ఇంతకు పూర్వం నాల్గవనియమంలో ఆర్యసభా సదస్యుడు సత్యం గ్రహించుటకు అసత్యం పరిత్యజించుటకు ఎల్లప్పుడు సిద్ధంగా ఉండాలని చెప్పి, యీ అయిదవ నియమంలో తదనుగుణముగా - అనగా సత్యానుగుణముగా సర్వకర్మలు ఆచరించాలని విధించుట జరిగినది. ఈ విధంగా ఈ రెండు నియమాలకు సంగతి కనబడుచున్నది.

నియమము

"సబ్ కామ్ ధర్మానుసార్ అర్థాత్ సత్య ఔర్ అసత్యకో విచారకరకే కర్ నే చాహియే."

తా॥ సర్వకార్యములను ధర్మానుసారముగా - అనగా సత్యాసత్యములను విచారించి చేయవలెను.

**మూఢాచారములు**

సర్వకార్యములు ధర్మానుసారంగా చేయాలనువిధి యీ నియమంలో ఉన్నది. కనుక మానవు డేపని చేసినను వివేకంతో చక్కగా ఆలోచించి ధర్మయుక్త మయితేనే - అనగా ధర్మకార్యమునే చేయా లన్నమాట. పూర్వము వేదకాలంలో ధర్మబోధకములగు వేదములు ప్రచారములో ఉండి అందరికీ అందుబాటులో నున్నప్పుడు ధర్మాధర్మనిర్ణయము సులభంగానే జరుగుతూ ఉండేది. ధర్మకర్మలే ఆచరింపబడుతూ ఉండేవి. మధ్యకాలంలో సంప్రదాయాలు వేదవిరుద్ధమయినవి ఏర్పడినవి. వానికి తోడుగా అసత్యములు పరస్పర విరుద్ధములు నగు విషయాలతో కూడిన పురాణములు వెలసినవి. వేదధర్మములే తమ పౌరాణిక గురువులు బోధిస్తున్నట్లుగా ప్రజలకు విశ్వాసం కలిగింపబడినది. అందువల్ల తమతమ సంప్రదాయాలమీద, గురువులమీద అంధవిశ్వాసం ప్రజలకు ఏర్పడినది. దానితో వారు ఆలోచించుటయే మానివేశారు. సర్వజ్ఞుడు, సృష్టికర్తయు నగు పరమేశ్వరుని ఉపాసించుటకు బదులు జడవస్తువులను పూజించి ప్రజలు జడులు కావడం జరిగినది.

దాని ఫలితంగానే - సూర్యచంద్రాదుల గతులలో ఏర్పడే గ్రహణము

లందు మృతపితరులకు తర్పణ లివ్వడం ధర్మంగా భావిస్తున్నారు. కుంతి దేవికి సూర్యునివల్ల కన్యకావస్థలో బిడ్డ పుట్టాడంటే నమ్ముతున్నారు. అట్లే మరియమ్మకు కన్యకావస్థలో దేవునివల్ల ఏసుక్రీస్తు పుట్టాడని కొందరు నమ్ముతున్నారు. ఆదిశేషుని (పాము) పడగలమీద భూమి ఉన్నదని కొందరు విశ్వసిస్తూ ఉంటే - భగవంతుడు ముందు మట్టితో మగవానిని సృజించి, (వానిని) నిద్రపుచ్చి వాని ప్రక్కటెముకతో ఆడదానిని సృష్టించినట్లు మరికొందరు విశ్వసిస్తూ ఉన్నారు. మహమ్మదును ప్రవక్తగానమ్మి, తమ(ముస్లిం)మతమును స్వీకరించనివారు పాపాత్ము (కాఫిరు)లని, వారికి ముక్తిలేదని వేరొక కొందరు ప్రచారం చేస్తున్నారు.

వైజ్ఞానికుల యభిప్రాయము

ధర్మంపేరుతో చెలామణీ అవుతున్న యీ అధర్మములను - అవక తవకలను - చూచియే వైజ్ఞానికులు ధర్మంఅంటే ఏవగించుకొనుచున్నారు. ఈ దేశంలోనే గాదు. ఇతరదేశాలలో కూడ పెద్దపెద్ద విద్వాంసులకు - వైజ్ఞానికులకు - ధర్మపదం పరిహాసపాత్రంగా ఉండడం చూస్తున్నాము. చూడండి -

1. ఫ్రాంసు పండితు డొకరు (బర్థోక్) :

"The day of Religion has passed and Religion must now be replaced by science."

అనగా - ధర్మపుదినాలు గతించినవి. ఇప్పుడు ధర్మము స్థానంలో విజ్ఞానం గ్రహించాలి.

2. సుప్రసిద్ధ రష్యన్ పండితుడు (టాల్‌స్టాయి) :

"Religion is obsolete : belief in any thing but science is ignorance. Science will arrange all that is needful and one must be guided in life by science alone." అనగా -

ధర్మయుగం గతించినది. విజ్ఞానముకు వ్యతిరేకముగ దేనిని నమ్మినను పొరపాటే అవుతుంది. మనకు కావలసినదంతయు విజ్ఞానం వల్లనే నెరవేరుతుంది. విజ్ఞానం మాత్రమే జీవితానికి మార్గదర్శకం కావాలి.

3. భారతదేశమందును ఆంగ్లభాషాధ్యయనం చేసిన పెద్దలు - హేతు

వాదులు కొందరు ఇట్టిభావం గలవారు ఉన్నారు.

వీరందరికి ధర్మం అన్నా, ఈశ్వరు డన్నా గిట్టవు. కారణం ? - 'అవి మానవుని స్వాతంత్ర్యం హరిస్తున్నవి. అంధవిశ్వాసం కల్గించి ఆలోచనాశక్తిని అణచివేస్తున్నవి. అంతేగాదు. సోమరులనుగా - పరాన్నభుక్కులనుగా మనుష్యులను తయారుచేస్తున్నవి.' - అని వారి యభిప్రాయం.

ఈ అభిప్రాయం కొంతవరకు నిజమే. వీరికీ పెద్దలకు ధర్మంమీద ధర్మపదంమీద ఇంతటి ఏవగింపు కలగడానికి కారణం ఆ యా మతాలలో - సంప్రదాయాలలో కన్పిస్తున్న మూఢాచారాలే. అయితే అది యొక్కటే కారణం కాదు. దానికితోడు ధర్మాన్ని గురించి సరిగా - లోతుగా వీరు తెలుసుకోక పోవడం - ఆలోచించకపోవడం కూడ మరొక ముఖ్యకారణం.

మానవు డేవిషయమయినను చక్కగా దీర్ఘంగా ఆలోచించి నిర్ణయించాలి. ఏపనినైనను వివేకంతో ఆలోచించి చేయాలి. ఒకానొక కర్తవ్య కర్మ ఉపస్థితమైనప్పుడు ముందే - అనగా తత్కర్మాచరణకు ముందే - మంచిచెడ్డలు విచారించాలి.

"వేదః స్మృతిః సదాచారః స్వస్య చ ప్రియ మాత్మనః
ఏత చ్చతుర్విధం ప్రాహుః సాక్షా ద్ధర్మస్య లక్షణమ్." (మను.2-12)

ఇది వేదానుకూలమా? కాదా? దీనివిషయంలో ఆర్షగ్రంథముల వ్యవస్థ యెట్లున్నది? ఇది సదాచారమునకు విరుద్ధము కాదుగదా! తన యంతః సాక్ష్య మెట్లున్నది? దీనివల్ల వ్యక్తికి సంఘానికి కలుగబోవు లాభనష్టము లేమి? అని యిట్లనేకవిధాల విచారించాలి. ఏలయన: విచారింపక తొందరపడి కర్మలాచరిస్తే దుష్ఫలితాలు కలుగుతవి. పిమ్మట కష్టనష్టాలకు గురికావలసి వస్తుంది. పశ్చాత్తాపపడవలసి యుంటుంది.

ఈ సందర్భంలో మహాకవి భారవి చెప్పిన పద్యం గమనింపదగి ఉన్నది. ఏమన :

**"సహసా విదధీత న క్రియా మవివేకః పరమాపదాం పదం
వృణుతే హి విమృశ్యకారిణం గుణలుబ్ధాః స్వయమేవ సంపదః"**

అనగా - ఏ పని తొందరపడి చేయరాదు. అవివేకము - అనగా

అనాలోచన ఆపదలకు స్థానం అవుతుంది. సంపదలు గుణలుబ్ధములు. అనగా గుణములయం దాసక్తిగలవి. కనుక విచారించి కర్తవ్యకర్మముల లాచరించు వారిని స్వయంగా అవి వరించును.' అని భావం.

కర్మములు మూడు విధములు

కర్మములుకూడ కాయికములు, వాచికములు, మానసికములు - అని మూడువిధాలుగా ఉన్నవి. ఇవన్నియు ధర్మానుసారంగా ఉండాలి. మనస్సులో సదా సత్సంకల్పములనే చేస్తూ ఉండాలి. దుస్సంకల్పములను అరికట్టుతూ ఉండాలి, అనగా తనకెట్లు హితము ప్రియమో, అహితము అప్రియమో అట్లే యితరులకు నగునని తలంచి అందరికి హితమునే మనసులో చింతిస్తూ ఉండాలి. అహితము చింతింపరాదు; కోరరాదు.

వాచికకర్మలలో మానసికములగు సంకల్పములే ప్రకటమవుతూ ఉంటవి. మానసిక సంకల్పములు - కర్మములు సూక్ష్మములు కాగా వాచికములు, కాయికములు నగు కర్మములు స్థూలములు, స్థూలతరములు నవుతున్నవి. అనగా మానసిక సూక్ష్మవిచారములు వాక్ కాయకర్మములలో స్థూల, స్థూలతర రూపములను పొంది వ్యక్తమవుతూఉంటవన్నమాట. అందువల్ల మనస్సెంత శుద్ధము, పవిత్రము - అగునో బాహ్య (వాచిక, కాయిక) కర్మలు కూడ అంత శుద్ధములు, పవిత్రములు - అవుతూ ఉంటవి. కనుక ఆర్యులు - సజ్జనులు మానసికపరిశుద్ధిని అధికంగా కోరుతూ ఉంటారు.

వాక్కు నిర్దుష్టముగా మధురముగా ఉండాలి. అనగా సత్యము వీడక పరహితభరితమై ఉండే ప్రియవాక్కులనే మాటాడాలి. సాధ్యాయమువల్ల వాక్కు రాణిస్తుంది. వేదశాస్త్రములపఠనము, గాయత్రీజపము స్వాధ్యాయ మనబడుతుంది. కాబట్టి వాక్కులలో అసత్యము, పారుష్యము, దోషారోపణ లేకుండ జాగ్రత్తపడాలి.

ఇక కాయిక ( శారీరిక) కర్మలు కూడ శుద్ధంగా, ధర్మానుసారంగా ఉండాలి. రక్షణ, సేవ, దానము మున్నగునవి శారీరికములయిన ఉత్తమ కర్మలు. వీనిని ఆచరించాలి. హింస, స్తేయము, వ్యభిచారము మున్నగునవి దుష్టకర్మలు - అధర్మములు, ఆర్యులు వీనిని ఆచరింపరాదు.

ఇట్లు వేదశాస్త్రముల యాధారంతో కర్మలస్వరూపం తెలుసుకొని మానసిక వాచిక కాయిక కర్మలలో అతి పవిత్రులై ఆర్యులు మెలగాలి.

విజ్ఞాన లక్షణము

ఇక ఈ కర్మల విషయం ఆపి. విజ్ఞానం (Science), ధర్మం అనే పదాల్ను విషయాలను గురించి కొంతపరిశీలింపవలసియున్నది. ఎందుకంటే -వైజ్ఞానికులు ధర్మం అంటే ఏవగించుకొంటున్నారు గదా! కాన వీనిని తులనాత్మకంగా పరిశీలించడం అవసరం.

విజ్ఞానం అంటే ఏమిటి? "కర్మోపాసనాజ్ఞానములను మూడింటిని సరిగా ఉపయోగించుకొనుటయు, పరమేశ్వరుడు మొదలు తృణపర్యంతం గల పదార్థములను బాగుగా తెలుసుకొని వానివలన తగినలాభాన్ని పొందుటయు విజ్ఞానమనబడుతుంది. అంటే - 1. పరమేశ్వరుని సరిగా నెరిగి అతని యాజ్ఞలను చక్కగా పాటిస్తూ ఉండాలి. 2. ఈశ్వరునిచే రచింపబడిన పదార్థములను, వానిగుణస్వభావములను బాగుగ విచారించి వానిచే నగు కార్యములను సిద్ధం చేసుకోవాలి. ఈశ్వరు డే పదార్థములను ఏ ప్రయోజనసిద్ధికై నిర్మించెనో వానిని అందులకు ఉపయోగించుకోవాలని భావం. పై రెండు విషయాలలో ఈశ్వర ప్రతిపాదన ముఖ్యం."

అని విజ్ఞానమును గురించి మహర్షి దయానందసరస్వతి ఋ-భా-భూమికయందు 'వేదవిషయవిచారం'లో వివరించారు.

ధర్మలక్షణము

ఇక ధర్మం అంటే యేమిటి? ధర్మం అనేది సంస్కృతభాషా పదం అయినా దీనికి ఆయా భాషలలో వేర్వేరు పర్యాయపదాలు వాడబడుతూ ఉన్నవి. ఇంగ్లీషులో రెలిజియన్ (Religion) - అని ధర్మానికి పర్యాయపదంగా వాడతారు. అంటే మనుష్యునికి ఈశ్వరునితో సంబంధం ,విశ్వాసం దేనిద్వారా కలుగుతుందో అది Religion అని ఒకవిధంగా చెప్పవచ్చు. కాని ధర్మపదానికి ఇంతకంటె వ్యాపకమయిన అర్థం ఉన్నది. 'ధృ' ధాతువుతో ధర్మపదం ఏర్పడుతుంది. ధరించుట, పోషించుట అని దానికి రెండు అర్థాలు ఉన్నవి. ఆ యర్థాలను మనసులో పెట్టుకొని శాస్త్రకారులు ధర్మపదం యొక్క అర్థాన్ని

ఎంతగానో వివరించారు.

1. 'చోదనా లక్షణోऽర్థః ధర్మః' (పూ. మీ. 1.1.2)

వేదములం దీశ్వరుడు మానవుల కేది చేయుట కాజ్ఞాపించియున్నాడో, ప్రేరణ చేసియున్నాడో అదియే ధర్మం.

2. 'యతోऽభ్యుదయ నిశ్శ్రేయస సిద్ధిః స ధర్మః' (వై. ద. 1-1-2)

దేని నాచరించుటవలన ఇహలోక (జన్మ)మందు ఉత్తమ సుఖము, పరలోక (జన్మ)మందు మోక్షసుఖము లభించునో అదియే ధర్మం. దానికి విరుద్ధమైనది అధర్మం.

3. "ధృతిః క్షమా దమోऽస్తేయం శౌచ మింద్రియనిగ్రహః ।
ధీ ర్విద్యా సత్య మక్రోధో దశకం ధర్మలక్షణమ్ ॥" (మను. 6-92)

ధైర్యము, ద్వంద్వసహనము, మనోనిగ్రహము, అస్తేయము, అంతర్బహిశ్చ శౌచము, బాహ్యేంద్రియనిగ్రహము, సత్సాంగత్యాదులతో బుద్ధిని వృద్ధిపరచుట, పృథివి మొదలు పరమేశ్వరుని వరకు గల పదార్థముల యథార్థజ్ఞానము, సత్యము - అనగా ఉన్నదున్నట్లు తెలియుట - చెప్పుట - చేయుట, అక్రోధము - అనగా శాంతి - ఇవి పదియు ధర్మమునకు లక్షణములు. అనగా ఈ గుణాలు కలవాడు ధర్మాత్ము డన్నమాట.

ఇట్లు ఆ యా మహర్షులు తమతమ శాస్త్రాలలో ధర్మాన్ని గురించి వివరించారు. దీనినిబట్టి ధర్మానికి ఎంతవిశాలమయిన అర్థం కలదో గ్రహింప వలసియున్నది.

ఆర్యులు చిరకాలంగా వేదవిహితకర్మలనే ధర్మకర్మలుగా తలంచుచు వచ్చారు. మనుమహర్షి కూడ "వేదోऽఖిలో ధర్మమూలమ్" - సమగ్రవేదము ధర్మములకు మూలమని వర్ణించియున్నారు. మహర్షిదయానంద సరస్వతి వేదాలకు భాష్యం వ్రాసినవారు. పరతః ప్రమాణములు, వేదములకు వ్యాఖ్యానభూతములు అయిన మహర్షులగ్రంథాలను క్షుణ్ణంగా చదివినవారు. ధర్మంయొక్క స్వరూపం సంపూర్ణంగా జీర్ణం చేసుకొన్నవారు. వారు తన రచనలయందు నాయా సందర్భములలో సులభంగా అర్థమయ్యే మాటలతో దానిని వివరించారు. ఏమని - ?

1. "సత్యభాషణాది యుక్తము, ఈశ్వరాజ్ఞ యను వేదమునకు అవిరుద్ధము, పక్షపాతరహితము నగు న్యాయాచరణమును ధర్మమనియు; మిథ్యాభాషణాది యుక్తము, ఈశ్వరాజ్ఞాభంగమను వేదవిరుద్ధము, పక్షపాతసహితము నగు అన్యాయాచరణమును అధర్మమనియు నమ్ముచున్నాడను." (స్వమంతవ్యామంతవ్య ప్రకాశము)

2. " పక్షపాతరహితమైన న్యాయము, సత్యగ్రహణము, అసత్యత్యాగము, పంచపరీక్షల కనుకూలమగు నాచరణము, ఈశ్వరాజ్ఞాపాలనము, పరోపకార మొనర్చుటయు ధర్మమనబడును. దీనికి విపరీతమైనది అధర్మము" (వ్యవహారభానువు 22)

3. "న్యాయము - అనగా పక్షపాతము విడిచి సత్యము నాచరించుట, అసత్యము త్యజించుట ధర్మమనబడును."

(ఋ. భా. భూమిక - వేదవిషయ విచారము)

4. ఆర్యోద్దేశ్యరత్నమాలలో కూడ నిదే రీతిని ధర్మాధర్మముల గురించి మహర్షి దయానందసరస్వతి వ్యాఖ్యానించియుండిరి.

ఇట్లు పలుతావులలో ధర్మాధర్మములను గురించి మహర్షి వివరించడం జరిగినది. వీటి అన్నింటిలో సత్యం, న్యాయం, నిష్పక్షపాతం - అనే మాటలు వాడటం కనబడుతుంది. ఆ మాటలతో పాఠకునికి ధర్మం తేలికగా అర్థమయ్యేటట్లు చేయడం జరిగినది.

' న హి సత్యా త్పరో ధర్మః' (మను. 8)

సత్యముకంటె మించిన ధర్మము లేదు.

'నాసౌ ధర్మః యత్ర న సత్య మస్తి' ( మహాభార .విదుర. 35-58)

ఎక్కడ సత్యము లేదో అది ధర్మము కాదు.

ఇత్యాది ప్రమాణములను బట్టి చూస్తే సత్యాచరణ ధర్మాచరణయే అని తేలుతుంది.

ఈ విధంగా లోతుగా విజ్ఞానాన్ని, ధర్మాన్ని పరిశీలించిచూస్తే విజ్ఞానం ధర్మానికి వ్యతిరేకం కాదని సులభంగా బోధపడుతుంది. అయితే వైజ్ఞానికులు ఇట్లు వేదశాస్త్రముల యాధారంతో ధర్మాధర్మములను అర్థం చేసుకోడానికి

ప్రయత్నించడం లేదు. మధ్యకాలంలో పౌరాణికులు - అయా మతములవారు - స్వార్థపరులై ధర్మం పేరుతో అధర్మాన్ని భిన్నభిన్న రీతులలో వ్యాపింపచేయడం వల్ల వాటిని జూచి విజ్ఞానానికి విరుద్ధంగా అవి ఉండటంవల్ల ఏవగించు కొంటున్నారు. కాని ఈశ్వరాజ్ఞయను వేదానికి, సృష్టిక్రమానికి విరుద్ధమైనది, పక్షపాతంతో కూడినది, అసత్యమైనది ధర్మంకాదని వారు గ్రహించడం లేదు. గ్రహించి ఉంటే ధర్మం విజ్ఞానవిరుద్ధం అని తలంపకపోదురు.

**ధర్మం ఒక్కటిగానే ఉంటుంది**

ఇట ధర్మవిషయంలో ఒక రహస్యం గ్రహింపవలసియున్నది. ఏమంటే - మనుష్యులందరికి ధర్మం ఒక్కటిగానే యుంటుంది. కాని కొందరు పండితు లనుకొనువారు సైతము దేశకాలాది భేదములనుబట్టి ధర్మం మారుతూ ఉంటుందని, భిన్నభిన్నంగా ఉంటుందని తలుస్తూ ఉంటారు. అది పొరపాటు. లోతుగా ఆలోచించకుండా చెప్పేమాట అది. ధర్మం నానారకాలుగా ఉండదు. ఎప్పుడూ ఒక్కటిగానే ఉంటుంది. ఈ విషయంలో మహర్షి మాటలనే చూడండి:

"అందరికి ధర్మం ఒక్కటా? అనేకమా? అనేక మంటిరేని ఒకటికొకటి విరుద్ధంగా ఉండునా? అవిరుద్ధంగా ఉండునా? విరుద్ధంగా ఉండునన్నచో ఒకటిమాత్రమే (తప్పు) - కాక మరొకటి ధర్మం కానేరదు. అవిరుద్ధంగా ఉండునన్నచో వేర్వేరుగా ఉండుట వ్యర్థము. కాన ధర్మంగాని అధర్మంగాని ఒక్కటొక్కటే యుంటుది. కాని అనేకమై ఉండదు. (స .ప్ర. 11 సము.)

ఇట్లు తర్కంతో దార్శనికభాషతో మహర్షి చెప్పిన యీ సమాధానం పాఠకుల కందరికి సులభంగా అర్థం కాకపోవచ్చు. అందుకనే మరల నిట ఉపాఖ్యానరూపంలో మహర్షి విషయం వివరించడం జరిగినది.

దాని సారం ఏమంటే :

సుమారు వెయ్యిమంది భిన్నభిన్న సంప్రదాయములవారిని సమావేశ పరచి ఒక జిజ్ఞాసువు ప్రశ్నింపగా ఎవరికి వారు తమతమ ధర్మమే ఉత్తమ మనియు, తక్కిన 999 మంది ధర్మములు అసత్యములనియు చెప్పిరి. తమ తమ ప్రవక్తలే గొప్పవారు అవతారపురుషులు అనియు చెప్పిరి. అంతట -

'వీరందరు పరస్పరం విరోధం కలిగియున్నారని, ఒక్కొక్కనిమాట అబద్ధమని 999 మంది సాక్ష్యమిచ్చుచున్నారని, అసత్యవాదులయిన అంగడివాండ్రవలె, వేశ్యలవలె తమతమ వస్తువులు మంచివని కొనియాడుచు తక్కినవారివి మంచివి కావని దూషించుచున్న రీతిని వీరు చేయుచున్నారని, వీరిలో గురువు కాదగినవాడు లేడనియు' - జిజ్ఞాసువు గ్రహించెను.

మరి ధర్మాధర్మములు తేల్చుకొనుటకు వారి నిట్లని ప్రశ్నించెను. ధర్మము సత్యభాషణమున నున్నదా? మిథ్యాభాషణముననా? అని ప్రశింపగా ఆయా మతములవారు - సత్యభాషణమున ధర్మము అసత్యభాషణమున అధర్మము కలదని జవాబిచ్చిరి.

మరల జిజ్ఞాసువు - 'విద్యాభ్యాసము, బ్రహ్మచర్య పాలనము, పూర్ణయువావస్థయందలి వివాహము, సత్సహవాసము, పురుషార్థము, సత్య వ్యవహారము మొదలగు వాని నాచరించుటయందు ధర్మం కలదా? లేక అవిద్యాగ్రహణము, బ్రహ్మచర్యము పాలింపకుండుట, వ్యభిచారము, దుస్సాంగత్యము, అసత్యవ్యవహారము, ఛలము, కపటము, హింస, పరహాని మొదలగు కర్మము లాచరించుటయందా?' అని యడుగగా - విద్యాభ్యాసము మొదలుగాగల కర్మములందే ధర్మమును, అవిద్యాగ్రహణాది కర్మములందు అధర్మము కలదని అందరు నేకగ్రీవముగా నంగీకరించిరి.

అప్పుడు జిజ్ఞాసువు - ఏ విషయంలో ఈ వేయిమతములు నేకీభవించునో అదియే సత్యము ధర్మము, వేదమతము, గ్రాహ్యము అని; ఇక ఏ విషయంలో పరస్పర విరోధముండునో అది కల్పితము, అసత్యము, అధర్మము, అగ్రాహ్యము నని గ్రహించెను.

ఇట్టి యుపాఖ్యానంద్వారా ధర్మంగాని, అధర్మంగాని అందరికీ ఒక్కటిగానే ఉంటుందని మహర్షి నిరూపించారు.

అయినా కొందరి కిట ఒక సందేహం రావచ్చు. ఏమని? శాస్త్రములలో వర్ణాశ్రమధర్మములు భిన్నభిన్నంగా వివరింపబడి యున్నవి గదా? మరి అందరికీ ధర్మం ఒక్కటిగానే ఉంటుందని యెట్లు చెప్పుచున్నారు ? అని వారి సందేహం. నిజమే. ఇట వర్ణాశ్రమరూపంలో ధర్మభేదంగాని మానవరూపంలో అందరికీ

ధర్మం ఒక్కటే అని గ్రహించాలి. అది సత్యాచరణమే అవుతుంది.

ఇట్లు మహర్షి ధర్మాధర్మములను గురించి తన గ్రంథములం దెంతగానో పరిశీలించి నిర్ణయించియుండిరి. దానిని మనసులో పెట్టుకొనియే సర్వ కార్యములు ధర్మానుసారంగా చేయాలని యీ నియమంలో చెప్పారు. అయితే అంతటితో తృప్తిపడక 'ధర్మానుసారంగా' అనుమాటకు 'సత్యాసత్యములను విచారించి' అను వివరణంకూడ నియమంలో చేర్చారు. అందు మహర్షి యభిప్రాయం ఇమిడిఉంది. ఏమిటి ఆ యభిప్రాయం?

అంధవిశ్వాసంతో కాక వివేకంతో విచారించి ధర్మానుసారంగా కర్మలాచరించా లనేది ఒకటి, ధర్మం అంటే ఏమిటో, తెలియదే! అని నిరుత్సాహపడక ధర్మంఅన్నా సత్యంఅన్నా ఒకటే కనుక సత్యకర్మలే ఆచరించాలనేది రెండు, ఈ రెండురకాలయిన అభిప్రాయంతో ఆ వివరణపదం చేర్చారు. అంతేగాదు. అంధవిశ్వాసం వీడి మనుష్యుని ఆలోచనాపరుని ధర్మరతుని చేయడానికి ఈ నియమం వ్రాయబడ్డది. ఆర్య సమాజానికి వన్నె దెచ్చు నియమ మియ్యది.

**ధర్మాచరణకు ప్రమాణములు**

1. **ధర్మ ఏవ హతో హన్తి ధర్మో రక్షతి రక్షితః ।**
   **తస్మా ద్ధర్మో న హంతవ్యో మానో ధర్మో హతోऽవధీత్ ' ॥** (మను. 13-15)
   
   ధర్మహాని జీవన హాని. ధర్మరక్షణ జీవనరక్షణ. కావున ధర్మహననము తగదు. హత ధర్మము మానవజీవనమును హతము చేయుకుండు గాక!

2. **'ధనాని భూమౌ పశవశ్చ గోష్ఠే నారీ గృహద్వారి జనః శ్మశానే ॥**
   **దేహ శ్చితాయాం పరలోకమార్గే ధర్మానుగో గచ్ఛతి జీవ ఏకః ॥**
   
   ధనము భూమియందు (బ్యాంకులలో), పశువులను కొట్టములందు, భార్య నింటిగుమ్మమందు, బంధుమిత్రాదులను స్మశానమందు, దేహమును చితియందును విడిచి జీవుడు పరలోకమునకు వెళ్ళును. అప్పుడు ధర్మమొక్కటే వానికి తోడగును. కాన ధర్మమొక్కటే నిజమగు మిత్రము.

ఇట్లు ధర్మంయొక్క ప్రాధాన్యతను దెలుపు వేదశాస్త్రప్రమాణము లనేకం గలవు.

ఈ నియమరచనకు ఆధారమగు మంత్రములు

ఈ క్రింది మంత్రముల యాధారముతో నీ అయిదవ నియమము రచింపబడినది.

1. 'సత్యే నావృతా, శ్రియా ప్రావృతా, యశసా పరివృతా :' (అథ. 12-5-2)

మనుష్యులెల్లరు వేదశాస్త్రముల మూలమునను ప్రత్యక్షాది ప్రమాణముల వలనను సత్యాన్ని పరీక్షించి, సత్యాచరణయుక్తులు కావలెను. శుభ గుణయుక్తులై చక్రవర్తి రాజ్యాద్యైశ్వర్యములను పొంది లక్ష్మితో, కాంతితో శోభిల్లవలెను. సత్యాచరణముతో, కీర్తితో కూడియుండవలెను.

2. 'దృష్ట్వా రూపే వ్యాకరోత్ సత్యానృతే ప్రజాపతిః ।
అశ్రద్ధా మనృతేऽదధా చ్ఛ్రద్ధాం సత్యే ప్రజాపతిః ॥' (యజు. 19-77)

సర్వజగత్తునకు స్వామియయిన పరమేశ్వరుడు మానవుల నుద్దేశించి - 'మీరు సర్వవిధముల సర్వకాలములందు సత్యమునందే ప్రీతి కలిగి యుండుడు. అసత్యమునం దెన్నడు ప్రీతి నుంచకుడు.' అని ఈ మంత్రంలో ఉపదేశించుచున్నాడు. ఎట్లన :

పరమేశ్వరుడు ప్రకటములు, గుప్తములు నగు లక్షణములు గల సత్యాసత్యములను ధర్మాధర్మములను తన సర్వజ్ఞత్వరూపమగు విద్యతో నెరింగి వేరుచేసెను. కాన మానవులారా! అధర్మమున శ్రద్ధ చూపకుడు. వేదశాస్త్రవిహితమై ప్రత్యక్షాది ప్రమాణములచే పరీక్షింపబడి పక్షపాత రహితమయిన న్యాయధర్మము నాచరించుటలో శ్రద్ధ చూపుడు. పరమేశ్వరుని యాజ్ఞలను పాలించుటలో ఎల్లపుడు ఆత్మ మనః ప్రాణముల నుపయోగించి పురుషార్థ మొనర్పుడు. సదా సత్యధర్మమునందే ప్రవృత్తులై యుండుడు.

ఈ నియమరచనలో నాధారభూతములు కాదగిన మంత్రము లనేకము లున్నను మహర్షి దృష్టి నర్థం చేసుకొనుటకై యిట రెండు మంత్రములు మాత్రం చూపబడినవి.

# ఆఱవ నియమము

అవ॥ ఇంతకు పూర్వము సృష్టికర్తయగు పరమేశ్వరునియొక్క విషయం మొదటి రెండు నియమములలో చెప్పబడినది. పిమ్మట మూడు నియమములలో వైయక్తికోన్నతికి వ్యక్తి (ఆర్యుడు) పాటింపవలసిన ధర్మములు చెప్పబడినవి. ఇక ఆఱునుండి పదివరకు ఉన్న అయిదు నియమములలో వ్యక్తి సమాజమందు నిర్వహింపవలసిన కర్తవ్యములను గురించి సామాజిక వ్యవస్థను గురించి చెప్పబడుతుంది.

నియమము

"సంసార్‌కా ఉపకార్ కర్‌నా ఇస్ సమాజ్‌కా ముఖ్య ఉద్దేశ్య హై. అర్థాత్ శారీరిక్, ఆత్మిక్ ఔర్ సామాజిక్ ఉన్నతి కర్‌నా."

తా॥ ప్రపంచమునకు ఉపకారము చేయుట ఈ సమాజముయొక్క ముఖ్యోద్దేశ్యము. అనగా శారీరికోన్నతికి, ఆత్మికోన్నతికి మరియు సామాజికోన్నతికి పాటుపడవలెను.

ఆర్యసమాజముయొక్క ఉద్దేశ్యము

ప్రకృత మీ ఆరవనియమమున ఆర్యసమాజం స్థాపించుటకు గల ముఖ్యోద్దేశ్యము చెప్పబడినది. ఏమిటి ఆ యుద్దేశ్యం? అంటే - ప్రపంచమునకు ఉపకారం చేయుటయే.

ప్రపంచము

ఇది సాధారణంగా ప్రపంచమందుగల సంస్థలలో, సంఘములలో, మతములలో దేనియందును కనుపించని గొప్ప ఉద్దేశ్యం; ఆశయం. ఏలయనగా - వానిలో ప్రతిదానియందు తన అనుయాయుల కొక ప్రత్యేకత కల్పించి సాయపడుట కనబడుతుంది. చూడండి :

మతసంస్థలలో ముస్లిములు గాని, క్రైస్తవులుగాని, బౌద్ధులుగాని, అట్లే రాజకీయసంఘములలో కాంగ్రెసువారుగాని, కమ్యూనిష్టులుగాని, జనసంఘమువారు గాని మరొక సంఘమువారుగాని ఇట్లే మరి యితర సమాజములలో గాని ఇతరులకు తోడ్పడుటకంటె తమతమ మతస్థులకు, అనుయాయులకు తోడ్పడుటయే ప్రధానంగా కనబడుతుంది. కాని వైదికుల

ధర్మ మట్టిదికాదు. అది ప్రపంచముకొర కేర్పడినది. ప్రపంచమునకు ఉపకారమొనర్చుటయే వైదికుల ముఖ్యకర్తవ్యం. వేదధర్మముల ప్రచారం చేయుట కేర్పడిన ఆర్యసమాజం ఏదో యొక దేశమునకు గాని, మతమునకు గాని, సంఘమునకు గాని సంబంధించినది గాదు; కానేరదు. సర్వప్రపంచమునకు అనగా సర్వదేశములకు, సర్వమతములకు, సర్వప్రాణులకు సంబంధించినది. కాన ఆర్యునిదృష్టిలో ఒక ఆర్యసమాజసదస్యుడే కాదు. ప్రపంచములోని సర్వమానవులు, మానవులేకాదు. పశు,పక్షి, క్రిమి,కీటాది సర్వప్రాణులు ఉపకారపాత్రములే అవుతవి. అందువలననే లోకములోని యితర మతములు ప్రాణులను - పశుపక్ష్యాదులను - చంపి వాని మాంసము తినుటకు ప్రేరేపించు చుండగా వైదిక ధర్మము జీవహింసను నిషేధిస్తూ బలివైశ్వదేవమును నిత్య కర్మలలో - (పంచమహా యజ్ఞములలో) ఒకటిగా జేర్చి పశుపక్ష్యాదులను పోషింపుమని - రక్షింపుమని బోధిస్తూ ఉన్నది. ఇట్లు ఈ ఆరవనియమములో 'ప్రపంచమునకు' అను పదము ఎంతో విశాలం, ఉన్నతం, ప్రేమపూరితం అయిన ఆశయమును సూచిస్తూ ఉన్నది.

మరియు ప్రపంచమనగా ఒక భూగోళమే కాదు. పంచభూతములు, సూర్యచంద్రనక్షత్రాది గోళము (అష్టవస్తువు)లు కూడ గ్రహింపబడుతవి. ఏలయనగా ఆ యెనిమిది లోకములలో ప్రాణికోటి కలదని మహర్షియొక్క అభిప్రాయం - విశ్వాసం - వేద ప్రబోధిత జ్ఞానమునై యున్నది. జీవులు అసంఖ్యాకములు. కనుక వానివాని కర్మల ననుసరించి వివిధలోకములలో వివిధయోనులయందు ఉద్భవిస్తూ ఉంటవి. కాన అనంతవిశ్వమున గల జీవులెల్లరకు ఉపకార మొనర్చుటయే - శుభము కాంక్షించుటయే యీ నియమముయొక్క అభిప్రాయం.

దీనినిబట్టి ప్రపంచమతములలో సంస్థలలో దేనియందును లేని విశిష్టత - ఔదార్యం ఈ ఆర్యసమాజమునందు కనబడుతూ ఉన్నది. ఏవిధమగు స్వార్థంతోను, సంకుచితభావంతోను హద్దులు పెట్టుకొని. మడికట్టుకొని యున్న సంస్థ - సమాజం - కాదిది. అందువలన ఆస్తికములగు సర్వమతములకు, సంస్థలకు, నెల్లరకు కాదనరాని - అనగా ఆమోదయోగ్యములయిన ఉత్తమ

నియమములే యిందున్నవి.

"విజానీ హ్యార్యాన్ యే చ దస్యవః బర్హి ష్మతే
రంధయాశాస దవ్రతాన్"

అని వేదం మనుష్యులను రెండుతెగలుగా విభజించి, అందు సంఘ శ్రేయస్సుకు పాటుపడుతూ వ్రతమయమగు జీవితం గడుపువారికి ఆర్యులని అట్లుకాక అవ్రతులై సంఘమునకు ద్రోహంచేయువారికి దస్యులు - అనార్యులు అని పేరుపెట్టినది. కాన ఆర్యసమాజమంటే ఉత్తముల సంఘమనియే అర్థము. అట్టి సంఘంలో స్వార్థమునకు, సంకుచిత్వమునకు తా వుండ నేరదు.

**ఉపకారము**

ఇంతవరకు ఉపకారపాత్రమగు ప్రపంచపదమును గూర్చి వివరించితిమి. ఇక ఉపకారమును గురించి వివరింపవలసియున్నది. ఆ వివరణమును కూడ మహర్షియే నియమమునందలి యుత్తరార్థంలో దెల్పియుండిరి. ఉపకారం మూడువిధములుగా చేయవచ్చు. అందు ప్రాణులయొక్క శారీరిక శక్తులను పెంపొందించుట మొదటిది. ఆత్మికోన్నతికి తోడ్పడుట రెండవది. సామాజికాభి వృద్ధికై యుపకరించుట మూడవది.

మనస్సు, వాక్కు, కాయము - అను మూడు క్రియాసాధనములని పూర్వనియమంలో చెప్పుకొన్నాం. ఈ త్రికరణములలో దేనితో నైనను ఇతర ప్రాణులకు ఉపకారంగాని, అపకారంగాని చేయవచ్చు. కావున ఆర్యులు తమతమ శక్త్యనుసారం, సాధనానుసారం ఇతరుల శారీరికోన్నతికి, ఆత్మికోన్నతికి మరియు సామాజికోన్నతికి పాటుపడవలెనని గ్రహించాలి. ఇందలి యితరుల యున్నతికి అనుపదముచే తన (వైయక్తిక) యున్నతిని నిర్లక్ష్యం చేయుమని తలంపరాదు. అందువలన ఈ ముప్విధములగు ఉన్నతికూడ వైయక్తికము, సాంఘికమునని రెండేసి విధములుగా ఉంటుంది.

ఒకటి శారీరికోన్నతి : - ఇది వైయక్తికము. సాంఘికము - అని రెండు విధములు. ప్రతివ్యక్తి తనశారీరకోన్నతి విషయమున జాగరూకుడై యుండవలెను. ఉదయం నిద్రలేచినదాది రాత్రి పరుండబోవువరకు వైదిక దినచర్యనుపాటించాలి. యుక్త - ఆహారవిహారములతో శరీరమును కాపాడుకోవాలి. మాదక ద్రవ్యముల

(మత్తుపదార్థముల) సేవింపరాదు. పరిశుద్ధ వస్త్రముల ధరించాలి. భోజనం హితముగ మితముగ ఉండవలెను. నియతసమయముల భోజనం చేయుట అవసరం. ఇల్లు, పరిసరములు ఆరోగ్యవిధులకు అనుకూలములయి పరిశుభ్రముగ నుండవలెను. ఇత్యాదులు వైయక్తిక శారీరికోన్నతికి పాటింప దగిన విధులు.

ఇట్లే పరశారీరికోన్నతికి తోడ్పడవలెను. భక్ష్యాభక్ష్యముల నిర్ణయించి ఆహారసేవనమున జాగ్రత్తపడునట్లు ఇతరులకు బోధింపవలెను. ఆరోగ్యసూత్రముల పాటించునట్లు చూడవలెను. అవసరమునుబట్టి వ్యాయామశాలలు, ఔషధశాలలు నిర్మింపజేసి శక్త్యనుసారం ఇతరులకు తోడ్పడవలెను. మానవుడు సంఘజీవి. కనుక సంఘ మనారోగ్యము పాలగుచో తాను (వ్యక్తి) ఆరోగ్యముతో నుండుట అసంభవం. అందువలన తనతోపాటు ఇతరుల శారీరికోన్నతికి ఆర్యులు తోడ్పడవలెను.

ఈ నియమంలో రెండవకర్తవ్యం ఆత్మికోన్నతికి పాటుపడుట. ఆత్మయనగా జీవాత్మ. అది జ్ఞాననిలయం. దానికి జననమరణములు లేవు. కాని శరీరసంబంధముతో రాగద్వేషములకు లోనై సదసత్కర్మము లాచరించి యది సుఖదుఃఖరూపఫలము లనుభవిస్తూ ఉంటుంది. కాన ఆత్మోన్నతిని కోరు మనుజుడు శరీరమును, మనస్సును, స్వాధీనమునం దుంచుకోవాలి. బాహ్యేంద్రియములను సైతం ఉచితరీతిని ప్రవర్తింపజేయాలి. స్వాధ్యాయము, ఈశ్వర ప్రణిధానము కలిగి యుండాలి. సంధ్యావందనము మానరాదు.

ఇట్లే పరుల యాత్మికోన్నతికి పాటుపడాలి. ధార్మికవిషయముల-వేదధర్మముల ప్రచారం చేయాలి. ధార్మిక గ్రంథముల జదువు నవకాశం ఇతరులకు కల్పించాలి. ఆత్మశాంతికి స్వాధ్యాయ - ఈశ్వర ప్రణిధానముల యావశ్యకతను గుర్తింపజేయాలి.

ఇక ఈ నియమంలో మూడవకర్తవ్యం సామాజికోన్నతికి పాటుపడుట. దీనిని అభిలషించు నార్యులు తమతమ గృహములందు నిత్యకర్మలగు పంచమహాయజ్ఞములు, నైమిత్తిక కర్మలగు షోడశసంస్కారములు ఆచరణలో పెట్టాలి. అవైదికములగు మూఢాచారములను తొలగించాలి. సంతానమును

సుశిక్షితులను చేయాలి. వ్యక్తులు శుభగుణసంపన్ను లయిన సమాజము నట్లే అవుతుంది.

తమ కుటుంబసభ్యుల యున్నతికి పాటుపడునట్లే ఆర్యులు సామాజికోన్నతికిని పాటుపడవలెను. ఆర్థిక, సాంఘిక, ధార్మిక, నైతిక, రాజకీయాది విషయములన్నింటిలోను సమాజశ్రేయస్సుకు కృషి చేయాలి. సమాజము లోని అవైదికములగు మూఢాచారములను అనగా బాల్య వివాహములు, వృద్ధవివాహములు, మద్యపానము, మాంసభోజనము, ద్యూతాది దుర్వ్యసనములు మున్నగువానిని తొలగించుటకు ప్రయత్నించాలి. గ్రామసేవ, దేశసేవ ముఖ్యమని భావించాలి. దేశంలో వరదలు, భూకంపములు, క్షామములు సంభవించుచో వానికి గురియైన దీనులకు అన్నివిధముల తోడ్పడాలి.

1. "మా గృధః కస్య స్విద్ధనం" (య. 40-1)
   ఇతరుల సొత్తు నాశింపకుము.
2. "అజ్యేష్ఠాసో అకనిష్ఠాసః" (ఋ. 5-55-5)
   మనుజులలో ఎక్కువ తక్కువలు లేవు.
3. "సంగచ్ఛధ్వం సంవదధ్వం సంవో మనాంసి జానతాం" (ఋ. 10.191-2)
   మీరందరు కలిసి నడవండి. కలిసి మాట్లాడండి. కలిసి ఆలోచించండి.

అనగా మనోవాక్కాయ కర్మములందు భేదములేక కలిసి ఐకమత్యముతో ప్రవర్తింపుడు.

ఇత్యాది వేదమంత్రముల యర్థము గ్రహించి సమాజాభివృద్ధికి పాటుపడాలి.

ఇట్లు వైయక్తిక సాంఘిక శారీరికోన్నతికి, ఆత్మికోన్నతికి, మరియు సామాజికోన్నతికి ఆర్యసమాజసభ్యులు పాటుపడాలి. కులమత దేశ భేదముల పాటింపరాదు. అని యీ ఆరవనియమం బోధిస్తూ ఉన్నది.

**ఈ నియమరచనకు ఆధారమగు మంత్రము**

**"లోకం పృణ" (య. 12-54)**

లోకోన్నతికి పాటుపడుము. ఇత్యాది వేదమంత్రము లీ నియమ రచనకు ఆధారములు.

## ఏడవ నియమము

అవ॥ ప్రపంచమున కుపకారము చేయుట ఆర్యసమాజం యొక్క ముఖ్యోద్దేశ్యమని ఆరవ నియమంలో చెప్పబడినది. ఆ యుపకార మొనర్చునప్పుడు వ్యక్తి లోకముతో మెలగవలసినతీరు ఈ నియమంలో చెప్పబడుతున్నది.

నియమము

"సబ్‌సే ప్రీతిపూర్వక్, ధర్మానుసార్, యథాయోగ్యవర్తనా చాహియే."

తా॥ అందరితో ప్రేమపూర్వకముగ, ధర్మానుసారముగ, యథా యోగ్యముగ వర్తింపవలెను.

మనుష్యుడు సంఘజీవి. కనుక బంధుమిత్రాదుల సాహాయ్యముతో, పరిసరముల ప్రభావముతో మనుష్యునకు అభివృద్ధి కలుగుతూ ఉంటుంది. అందువలన నిత్యజీవనమున ఇతరులతో నెట్లు ప్రవర్తింపవలెనో యీ నియమం బోధిస్తూ ఉన్నది. ఇతరులతో నెరపవలసిన ప్రవర్తన ప్రీతిపూర్వకంగా, ధర్మానుసారంగా, యథాయోగ్యంగా ఉండాలని మూడు విశేషణలతో వర్ణింపబడినది. కాన ఆ విశేషణముల లోని భావమును పూర్ణముగ గ్రహింపవలసి యున్నది.

ప్రేమ

లోకంలో పరస్పర వ్యవహారమునకు కొన్ని గుణములు అవసరం. అందు ప్రేమ ప్రధానమైనది. బంధుమిత్రాదులతోగాని, పరివార జనులతో గాని అధికారులతోగాని, అనధికారులతోగాని, ఇరుగు పొరుగువారితోగాని, మరెవరితో నైనను ప్రేమతో మెలగడం నేర్చుకోవాలి. లేకున్న పరస్పర వ్యవహారం శిథిల మవుతుంది. దానివలన జీవితంలో శాంతి ఉండనేరదు. ప్రేమ ప్రాణులను దగ్గరకు చేర్చుతుంది. ద్వేషము దూరము చేస్తుంది. ఎట్లన - చేతిలో తన కాహారమగు గ్రాసము - మేత - పట్టుకొనియున్నచో ఆ మనుజుని పశువు సమీపిస్తుంది. లేక దండము - కఱ్ఱ పట్టుకొని యున్నచో సమీపింపక పోగా పశువు దూరమేగుతుంది. దానికి కారణమేమి? మేత ప్రేమసూచకమై

పశువును దగ్గరకు చేర్చగా దండము భయహేతువై దూరమగునట్లు చేసినది. కాన ఇతరులతో ప్రేమపూర్వకంగా మెలగుట - వర్తించుట ముఖ్యం. ఇదే భావమును -

**"మిత్రస్య చక్షుషా సమీక్షామహే" (య. 36-18)**

'మిత్రదృష్టితో అనగా ప్రేమపూర్వకముగ వ్యవహరింతము.' అను వేదమంత్రము వెల్లడిస్తూ ఉన్నది.

కాని లోకంలో తనవారిని ఆదరించి యితరులను అనాదరించుట సర్వసామాన్య వ్యవహారమై పోయినది. ఆయా మతముల - సంప్రదాయముల - వారిని చూచినచో ఈ విషయం బోధపడుతుంది. ఖురానులోగాని, బైబిలులోగాని నీ పొరుగువారిని ప్రేమించుమను వాక్యములు ఉండవచ్చు. కాని వాని యంతరార్థము పరిశీలించినచో నీ పొరుగున నివసించు నీ మతస్థుని ప్రేమించుమనియే బోధపడుతుంది. ఏలయన - మహమ్మదీయులు గాని, క్రైస్తవులుగాని, స్వమతేతరులను కాఫిరులని (పాపులని), అన్యులని (పెరవారని) వ్యవహరించుచు వారిని నీచంగా, హీనంగా జూచుచుండుట అందరికి దెలిసినదే. కాబట్టి నీ పొరుగువానిని ప్రేమించుమను వాక్యానికి నీపొరుగుననున్న నీ మతస్థుని ప్రేమించుమని సంకుచితార్థమే చెప్పవలసియుంటుంది. అందువలన విశ్వంలో శాంతికి బదులు అశాంతియే ప్రబలుతుంది.

ఇక వైదిక ధర్మమో అట్టిది గాదు.

**"కృణ్వంతో విశ్వ మార్యమ్ "**

విశ్వమానవులను ఆర్యులుగా - ఉత్తములుగ ఒనర్చుము.

అని వేద మాదేశిస్తూ ఉన్నది. ఆర్యులన ఒక జాతి (తెగ) అని భ్రమింపరాదు. గుణకర్మ స్వభావములచే పవిత్రులయి "ఈశ్వరపుత్రులని' (ఆర్యః ఈశ్వరపుత్రః) అనిపించుకొన గలుగునట్లు ప్రవర్తించువారు ఆర్యులు. దానికి భిన్నంగా సంఘద్రోహులై వర్తించువారు అనార్యులు - దస్యులు - రాక్షసులు. కాన వైదిక ధర్మం విశ్వమానవుల ప్రేమించి ఆర్యులుగా - ఉత్తములుగా ఒనర్చు మనుచున్నది.

కాబట్టి స్వపరభేదం లేకుండా అందరితో ప్రేమ పూర్వకంగా మెలగాలని



యీ నియమం బోధిస్తుంది.

**ధర్మానుసారము**

అయితే ఆ ప్రేమ యెట్లుండవలెనో తరువాత నున్నరెండు విశేషణములు దెలుపుతూ ఉన్నవి. వానిలో మొదటి విశేషణం ప్రేమ ధర్మానుసారంగా ఉండాలని చెప్పుచున్నది. ప్రేమ కొన్నియెడల గ్రుడ్డిదియై అనుచిత వ్యవహారములకు తావిచ్చుట కలదు. ఎట్లన - ప్రేమవశమున గురువు శిష్యులయు, తండ్రి బిడ్డలయు దుష్కృత్యములను అరికట్టలేక పోవచ్చు. అట్లె న్యాయాధిపతి ప్రేమవశమున నిందితులకు - ముద్దాయీలకు - తగినదండన విధింపకపోవచ్చు. ఇట్టి తావులలో ప్రేమవలన ధర్మమునకు హాని కలుగుతుంది. అధర్మమునకు ప్రోత్సాహం - దోహదం - ఏర్పడుతుంది. దానివలన లోకంలో దుష్కృత్యములు ప్రబలి అశాంతి యేర్పడుతుంది. ఆలోచించినచో ఇది నిజమైన - నిర్దుష్టమైన ప్రేమగాదు. మోహంతోకూడి గ్రుడ్డిది అయినది. ఆలోచన కోల్పోయినది. అందువలన ధర్మాధర్మవిచక్షణ కలిగి ధర్మమును మాత్రమే అనుసరించునదిగ ప్రేమ ఉండాలనుచు 'ధర్మానుసారముగ' అను విశేషణం నియమంలో చేర్చబడినది. కాన ప్రేమ మోహావృతమయి సంకుచితభావంతో స్వ పర భేదమును పాటించునదిగా ఉండరాదు. ధర్మమును న్యాయమును అనుసరించునదిగా ప్రేమ ఉండాలి.

**యథా యోగ్యము**

అయినా అంతమాత్రంతో చాలదు. యథాయోగ్యంగా కూడ ప్రేమ వ్యవహార ముండాలని రెండవ విశేషణం హెచ్చరిస్తూ ఉన్నది.

సమాజంలో మంచివారితోబాటు చెడ్డవారును అనగా జారులు, చోరులు, హింసకులు మున్నగు ద్రోహులును ఉంటారు. వారియెడ కూడ ప్రేమతోనే ప్రవర్తింపవలెనా? మరియు అటవీప్రాంతములో పల్లెల పాడుచేయు, పల్లె వాసుల కిబ్బందులు కలిగించు క్రూరమృగములు ఉంటవి. వానినిగూడ ప్రేమింపవలెనా? ఇత్యాది ప్రశ్నలు స్థూలదృష్టికి కలుగవచ్చు. వానికి సమాధానముగనే 'యథాయోగ్యముగ' అను విశేషణం ఈ నియమంలో చేర్చబడినది. అనగా యోగ్యులయిన వారియెడనే ప్రేమతో మెలగాలి.

అయోగ్యులయెడ మాత్రం శిక్షణరూపంలో ప్రేమయుండాలి. అంటే -

దుష్టులయెడ దౌష్ట్యమును ఉపయోగించాలి. మాయావుల యెడ మాయ నుపయోగించాలి. అయితే అది చూచువారికి ప్రేమ రాహిత్యమును, కాఠిన్యమును సూచింపవచ్చును. కాని అందలి నిగూఢమగు విశ్వప్రేమను గుర్తింపవలసియున్నది. ఒక దుష్టుని - అపరాధిని - శిక్షించినచో పదిమందికి (పలువురికి) ఉపకారం చేసినట్లగును. కావున ప్రేమనుగూడ యథాయోగ్యముగ ప్రదర్శింపదగును. (ఈ సందర్భములో రెండవ నియమమున న్యాయకారి, దయాళువు - పదముల యర్థము వివరించుచు మహర్షి వ్రాసిన యభిప్రాయమును చూడనగును)

"కృతే ప్రతికృతిం కుర్యా ద్ధింసితే ప్రతిహింసితమ్ ।
అత్ర దోషం న పశ్యామి శఠే శాఠ్యం సమాచరేత్ " (మ.భా.)

ఆక్రమణ పరులపై ఆక్రమణ, హింసకులపై ప్రతిహింస, శఠునిపై శాఠ్యము నెఱపవలెను. ఇం దేమాత్రము దోషము లేదు.

**"ఆరోహేమ మశ్మానం అశ్మేవ త్వం స్థిరా భవ ।**
**అభితిష్ఠ పృతన్యతోऽవభాధస్వ పృతనాయతః ॥ (పార. 1-7-1)**

వధూ! ఈ శిలను త్రొక్కుము. శిలవలె స్థిరముగ నుండుము. నీకు ఎగ్గుచేయు దుష్టులను, దుష్టభావములను ఎదుర్కొని విజయము గాంచుము.

ఇంతయేల? భగవద్గీతలో యోగిరాజు శ్రీకృష్ణుడు - "యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహమ్॥" (4-11) నాతో ఎవరెట్లు ప్రవర్తింతురో వారితో నన్లే వ్యవహరింతునని చెప్పినాడుగదా!

కనుక పై ప్రమాణములను బట్టి ధర్మరక్షణకొరకు దుష్టులను దండించుటలో దోషము లేదని తెలియుచున్నది.

**ఈ నియమరచనకు ఆధారమగు మంత్రములు**

**"మిత్రస్య చక్షుషా సమీక్షామహే"** (య. 36-18)

మనము మిత్రదృష్టితో అనగా పరస్పరము ప్రేమతో ప్రవర్తింపదగును.

"మాయాభి ర్మాయినం సక్ష దింద్ర" ః (ఋ. 5-30-6)

మాయావులను మాయలతోనే శిక్షింపనగును.

ఇత్యాది మంత్రములు ఈ నియమరచనకు ఆధారములు.

## ఎనిమిదవ నియమము

అవ॥ లోకంతో మెలగవలసిన తీరు పూర్వనియమంలో చెప్పబడినది. ఇక లోకంలో సర్వానర్థములకు మూలమగు అవిద్యను తొలగించి విద్యను వ్యాపింపజేయుట ముఖ్యమని యీ నియమంలో చెప్పబడుతున్నది.

నియమము

"అవిద్యాకా నాశ్ ఔర్ విద్యాకీ వృద్ధి కర్ నీ చాహియే "

తా॥ అవిద్యను నశింపజేసి విద్యను పెంపొందింపజేయవలెను.

విద్యావిద్యలు

లోకంలో అవిద్యను తొలగించి విద్యను వ్యాపింపజేయాలని యీ నియమం బోధిస్తున్నది. కాన విద్య యననేమో అవిద్య యననేమో మొదట విచారించాలి.

విద్యయనగా జ్ఞానం. ఉన్నది ఉన్నట్లు తెలుసుకొనుటయే జ్ఞానం - విద్య అనబడుతుంది. విద్యకానిది అవిద్య; అనగా అజ్ఞానం. అంటే - ఉన్నది ఒకటిఅయితే మరొకటిగా తెలుసుకొనుట. దానినే భ్రాంతిజ్ఞానం - విపరీతజ్ఞానం అంటారు. ఈ విపరీతజ్ఞానంవలన పనులు సక్రమంగా నెరవేరవు. కష్టములు నష్టములు సంభవిస్తవి. ఎట్లన -

ఒకడు త్రాడును చూచి మసకచీకటిలో పామని భ్రమిస్తాడు. దానితో వాడు భయపడి జ్వరపడతాడు. ఈ అవస్థకు కారణం ఏమిటి ? భ్రాంతి జ్ఞానమే. అట్లుగాక త్రాడును త్రాడుగానే గ్రహించి ఉంటే ఈ కష్టము సంభవించేది కాదు. అట్లే ఒక పనిని నెరవేర్చాలి, అంటే సరియైన జ్ఞానం ఉండాలి. తెలియకుండా అజ్ఞానంతో చేస్తే ఆ పని చెడుతుంది. ఫలితం ఉండదు. కష్టము, నష్టము, సంభవిస్తుంది. నిర్మాణజ్ఞానం లేకయే, అనుభవం లేకయే ఒకడు కుండలు తయారుచేయుటానికి పూనుకొంటే - పాళ్ళు సరిలేక మట్టిలో పాకంరాదు. నారె, కఱ్ఱ ఉపయోగించు తెలివిలేక కుండ సరిగా తయారు కాదు. అందువల్ల ఆ కుమ్మరికి నష్టము, కష్టము, తప్ప మరొండు ప్రయోజనం కలుగనేరదు. అట్లే స్వర్ణకారుని పనియు.

కాబట్టి ఒక కార్యమును నిర్వహించటానికిగాని ఒక వస్తువును గ్రహించటానికిగాని అవసరమగు యథార్థజ్ఞానం విద్యయనియు, దానికి విపరీతమైనది అనగా అయథార్థజ్ఞానం - భ్రాంతిజ్ఞానం - అవిద్యయనియు, అవిద్యవల్ల నష్టములు, కష్టములు సంభవించుననియు గ్రహించాలి. లోకంలో ఎన్ని రకాల పదార్థములుండునో ఎన్ని రకాల కార్యములుండునో అన్ని రకాలుగా జ్ఞానం, అజ్ఞానం ఉంటుంది. కాన జ్ఞానంగాని అజ్ఞానంగాని యిదిగో యిన్ని విధాలుగా ఉంటుందని చెప్పనలవిగాదు. అయినా మహర్షి పతంజలి తన యోగదర్శన గ్రంథంలో స్థూలంగా విద్యావిద్యలను సంగ్రహించి నాలుగు రకాలుగా నిర్ణయించారు.

"**అనిత్యాశుచి దుఃఖానాత్మసు నిత్య శుచి సుఖాత్మఖ్యాతి రవిద్యా**"

(యో. ద. 2-5)

అనిత్యమును, నిత్యమని, అశుచిని శుచియని, దుఃఖమును సుఖమని, అనాత్మను ఆత్మయని తలంచుట అవిద్య యనబడుతుంది.

దీని నింకను సంగ్రహించి ఒకే మాటలో చెప్పాలంటే ఉన్నది ఉన్నట్లుగాక తద్విపరీతముగ గ్రహించుట అవిద్య యనబడుతుంది - అని తేలును.

మరియు మహర్షి దయానందసరస్వతి వ్యవహారభానువులో విద్యావిద్యలను గురించి యిట్లు వివరించారు.

"దేనివలన పదార్థముల స్వరూపం యథావత్తుగ నెఱిగి దానినుండి ఉపకారమును గ్రహించి తనకొరకు పరులకొరకు సకల సుఖములను సాధింపగలుగునో అది విద్య. దేనివలన పదార్థముల స్వరూపం విరుద్ధముగ నెరిగి తాను పరులు అనుపకారము పొందుదురో అది యవిద్య యనబడుతుంది." అని.

దీనినిబట్టి యథార్థజ్ఞానం విద్యయని, భ్రాంతిజ్ఞానం అవిద్యయని గ్రహింపనగును. అంతేగాదు. విద్యవలన సుఖం, లాభం కలుగుచుండగా అవిద్యవలన కష్టం, నష్టం, కలుగుననియు తెలుసుకోవాలి. కనుక లోకంలో అవిద్యను నశింపజేసి విద్యను పెంపొందింపవలెనని యీ నియమం బోధిస్తున్నది.

**అవిద్యాభేదములు**

అయితే ఇహ పర లోకములకు సంబంధించి అవిద్య రెండు విధములుగా ఉంటుంది. అందు -

1. గృహకార్యభారమును సరిగ నిర్వహింపకుండుట, సంతానం యొక్క ఉన్నతికి యత్నం చేయకుండుట, వైయక్తిక కర్తవ్యములనుగాని, కౌటుంబిక - సామాజిక కర్తవ్యములనుగాని పాలింపకుండుట - మున్నగు లౌకిక జీవనయాత్రకు సంబంధించిన కార్యములలో నేర్పు లేకుండుట ఐహికమైన అవిద్య యనబడుతుంది. దీనివలన గృహస్థ జీవనము పాడవుతుంది. అనాచారభూయిష్ఠ మవుతుంది. అసత్యమూలకమగు (జడ) పూజలు, వ్రతములు ప్రవేశించి కష్టనష్టములకు గురియవుతుంది. ఐహిక - అవిద్యా మూలకమైన యిట్టి యనర్థములనుండి సంసారమును తప్పించుటయే యీ నియమంయొక్క ఉద్దేశ్యం.

2. ఇక అధర్మాచరణము, ఆత్మానాత్మల నెరుంగకుండుట పరలోక సంబంధమగు అవిద్య యనబడుతుంది. ఇట్టి యవిద్యలో మునిగిన మనుజుడు జీవేశ్వరుల స్వరూపం ఎరుగడు. ప్రపంచస్వరూపం ఎరుగడు. సత్యాసత్యముల వివేకింపజాలడు. జీవిత ప్రయోజనమును ధర్మమును గుర్తింపనేరడు. అందువలన అతడు కష్టనష్టములకు అశాంతికి గురికాక తప్పదు.

ఈ విధంగా అవిద్య శారీరిక మానసిక క్లేశముల కన్నింటికి పుట్టి నిల్లని గ్రహించాలి. అవిద్య యున్న మనుజుడుగాని జాతిగాని పెక్కు సంకటములకు గురి అవుతుంది

**విద్యావ్యాప్తికి సాధనములు**

కావున ఐహిక పారలౌకిక అవిద్యను నశింపజేసి విద్యను పెంపొందించుటకై కృషి చేయాలి. ఐహిక జ్ఞానాభివృద్ధికి తగు పాఠశాలలు, శిల్ప విద్యాలయములు నేర్పరుపవచ్చును. పారలౌకిక జ్ఞానసంపత్తికై, వేదాది శాస్త్రాధ్యయనమునకు ఉపకరించు సంస్థల నేర్పరుపవచ్చును. అష్టాంగ యోగము సభ్యసించు స్థానముల నెలకొల్పవచ్చును.

కాగా ప్రపంచంలో దుఃఖములకు మూలం అవిద్యయని గ్రహించి వేదాదిసత్యశాస్త్రముల ధర్మప్రచారంతో అవిద్యను నశింపజేసి విద్యను పెంపొందింపజేయుటయే యీ నియమం యొక్క ముఖ్యోద్దేశ్యం. ఇట్టి విద్యాదాన మార్యులకు ముఖ్యకర్తవ్యం. ఈదృష్టితోనే మూడవనియమంలో సమస్తసత్యవిద్యలకు ఆకరమగు వేదమును చదువుట - చదివించుట, వినుట - వినిపించుట చేయాలని విధింపబడినది.

విద్యావ్యాప్తికి ప్రమాణములు

వేదముకాని వేదానుకూల శాస్త్రములుకాని, విద్యాదానము నరికట్టుట లేదు.

"యథేమాం వాచం కల్యాణీ మావదాని జనేభ్యః" (య .26-2)

"యథా భర్గస్వతీం వాచ మావదాని జనాం అను." (అథ. 6-69-2)

ఇత్యాదిమంత్రములద్వారా సర్వమానవులకు విద్యాదాన మొసంగ పరమేశ్వరునిచే పండితు లాదేశింపబడిరి. ఇట్లు వైదికధర్మ మొక్కటే కుల మత స్త్రీ పురుషాది భేదములు పాటింపక ప్రపచంలోని మానవులెల్లరకు విద్యాదానము చేయ నభిలషిస్తూ ఉన్నది. మరియు

మనుష్యునకు జన్మతో నేర్పడిన మూడు (పితృ, ఋషి, దేవ) ఋణాలలో ఋషిఋణం ఒకటి. అది ఋషులద్వారా అందించబడిన ఈశ్వరీయ వేదశాస్త్ర జ్ఞానముచే తనజ్ఞానం పెంచుకొనుటవల్ల ఏర్పడుతుంది. అధ్యాపన క్రియ ద్వారా దాని నితరులకు (శిష్యులకు) అందించుటచే నా ఋణం తీరుతుంది.' అనునది వైదికుల సిద్ధాంతం, ఆచరణ నేటికిని ఆవైదిక ధర్మం కాశ్యాది విద్యాపీఠములందు పాటింపబడుట చూచుచున్నాం.

అట్టి వైదికధర్మంయొక్క - ప్రచారంకొరకు వెలసినది ఆర్యసమాజం. అందువల్లనే మహర్షి దయానందసరస్వతి ఆర్యసమాజ నియమములలో మూడవదానియందు 'సమస్త సత్యవిద్యల గ్రంథమగు వేదమును చదువుట' ఆర్యుల కందరికి పరమ ధర్మముగ విధించియుండిరి. అయినా అంతటితో తృప్తిపడక సామాజిక - ఉన్నతి కలుగవలెనంటే ప్రధానంగా అవిద్యను తొలగించి విద్యను వ్యాపింప జేయాలని మరల ఈ నియమంద్వారా ప్రబోధిస్తున్నారు.

ప్రాచీన - ఆర్షసంప్రదాయము ననుసరించియే యీ నియమం వ్రాయబడినది. ఈ విషయంలో అనగా విద్యావ్యాప్తి విషయంలో మహర్షికి ఎంతటిపట్టుదల గలదో యిక్రింది వారి మాటలవలననే వ్యక్తం కాగలదు.

1. "మాతా శత్రుః పితా వైరీ యేన బాలో న పాఠితః"

(చాణక్యనీతి. 2-10)

విద్య నేర్పని తల్లిదండ్రులు సంతానమునకు ప్రబల వైరులు.

(స. ప్ర. రెం. సము.)

ఎనిమిదేండ్లకు పిమ్మట ఆడుబిడ్డలనుగాని మగబిడ్డలనుగాని యింట నుంచక గురుకులమునకు పంపవలయునని రాజు నియమింపవలెను. ఈనియమము పాటింపని తల్లిదండ్రులను రాజు దండింపవలెను.

2. "సర్వేషా మేవ దానానాం బ్రహ్మదానం విశిష్యతే" (మను. 4-233)

సమస్తదానములలో వేదవిద్యాదానమతి శ్రేష్ఠము. (స.ప్ర. మూ. సము.)

ఇట్లితర ప్రమాణములతో విద్యాప్రచారమునకు తన యభిప్రాయమును సమర్థించుకొనుచు సత్యార్థప్రకాశంలో మహర్షి వ్రాసిరి. దీని ననుసరించియే ఆర్యసమాజం ఉత్తరభారతమున పెక్కురాష్ట్రములలో అనేక పాఠశాలలు, గురుకులములు, కన్యాపాఠశాలలు, కళాశాలలు నెలకొల్పి విద్యావ్యాప్తికి పాటుపడుతూ ఉన్నది.

దక్షిణభారతమున గల రాష్ట్రములలో గూడ నిట్టి ప్రయత్నం జరుగవలసియున్నది. అస్తు.

**ఈ నియమరచనకు ఆధారమగు మంత్రములు**

**"యథేమాం వాచం కల్యాణీ మావదాని జనేభ్యః"** (య. 26-2)

**యథా భర్గస్వతీం వాచ మావదాని జనాం అను"** (అథ. 6 - 69-2)

ప్రజలకొఱకు ఈ వేదవాణి నొసంగితిని.

**"కేతుం కృణ్వ న్న కేతవే"** (య. 29-37)

అజ్ఞానులకు జ్ఞాన మొసంగుము.

ఇత్యాది మంత్రము లీ నియమరచనకు ఆధారములు.

## తొమ్మిదవ నియమము

అవ॥ ఎనిమిదవ నియమంలో సామాజికోన్నతికి ముఖ్యమైన సాధనం చెప్పబడినది. ఈ నియమంలో సామాజికోన్నతి ముఖ్యమని చెప్పబడుతున్నది.

నియమము

**"ప్రత్యేక్‌కో అప్‌నీహీ ఉన్నతిమే సంతుష్ట న రహనా చాహియే. కింతు సబ్‌కీ ఉన్నతిమే అప్‌నీ ఉన్నతి సమఝునీ చాహియే."**

తా॥ ప్రతివ్యక్తియు తన యున్నతితోనే సంతృప్తి నొందక అందరి యున్నతిలోనే తన యున్నతి కలదని తలంపవలెను.

సర్వపదార్థములు గతిమంతములు

ప్రపంచంలోని ప్రతిపదార్థం గతిశీలం కలదై ఉన్నది. పరమాణువు మొదలు బ్రహ్మాండంలోని మహాపదార్థం వరకు అన్ని పదార్థములు గతి యుక్తములైయే ఉన్నవి.

**" యత్కిం చ జగత్యాం జగత్"** (య. 40-1)

'ప్రపంచంలో ఏమాత్రం పదార్థం ఉన్నా, అది కదలుచునే ఉన్నది' - అని యజుర్వేద మంత్రం చెప్పుచున్నది.

అందు ఒక పరమాణువున గతి నశించినచో - నిరుద్ధమైనచో - ప్రపంచముననే గతి నిరుద్ధమై ప్రళయం కలుగుతుంది. అందువల్లనే ప్రపంచమును సంసారమనియు, జగత్తనియు అంటారు. సంసార జగచ్ఛబ్దములు రెండును గమనశీలతను బోధించును.

ఈ గతియే లోకంలో వృద్ధిక్షయములకు కారణం. ప్రతిపదార్థం గతిమంత మగుటచే అయ్యది వృద్ధినో క్షయమునో పొందుతూ ఉంటుంది. ఈ నియమం మనుష్యులలోకూడ పనిచేస్తూ ఉంటుంది. కనుక ప్రతివ్యక్తి, ప్రతిజాతి, ప్రతి క్షణం ఉన్నతిపథమునో, అవనతిపథమునో అనుసరింపక తప్పదు. అయితే సుఖమునుగాని, గౌరవప్రతిష్ఠలనుగాని అపేక్షించువారు ఉన్నతి పథము నధిగమించుటకు ప్రయత్నించాలి.

వ్యక్తి సమాజముల యున్నతి

అయితే ఉన్నతికి ప్రయత్నించునపుడు ప్రతివ్యక్తియు తన తోడి వారల యున్నతిలోనే తన యున్నతి ఉన్నట్లు గుర్తించాలి. ఎందుకంటే - సామూహిక ఉన్నతియే లోకంలో నిజమైన ఉన్నతి అవుతుంది. దానివలననే అందముగాని సుఖముగాని లభిస్తుంది. కాని వైయక్తిక (వ్యక్తిగత) మగు ఉన్నతివల్ల అందంగాని సుఖంగాని లభింపనేరవు. పైపెచ్చు కష్టములు, నష్టములు కలిగి దుఃఖం ప్రాప్తిస్తుంది. అందువలన వైయక్తికోన్నతి సరియైనది కాదు. దీనికొక ఉదాహరణ. చూడండి :

ఒక గులాబితోటగాని మామిడితోటగాని ఉన్నదనుకొందము. అందు ఒక గులాబిమొక్క ఏపుగా పెరిగి పుష్పభరితమై తక్కిన మొక్కలన్నియు పువ్వులులేక మోడువారి యున్నచో ఆ తోట చూచుటకు ఎట్లా ఉంటుంది? అట్లే మామిడితోటయందును ఒక వృక్షము ఫలభరితమై రాణింప తక్కిన వృక్షములు ఫలములుగాని పత్రములుగాని లేక ఎండబారియుండుచో ఆ తోట ఎట్లా ఉంటుంది. చూడటానికి అందంగా ఉండవు సరిగదా యజమానులకు నష్టము, కష్టము కలిగిస్తూ అవి దుఃఖదాయకములు గానే ఉంటవి.

అదేవిధంగా ఇరుగుపొరుగు పేదలనేకులలో ఒకడు ధనికుడై ఉన్నా రాణింపడు; సుఖం అనుభవింపడు. ఒక క్షణంలో కాకున్న మరొక క్షణంలోనైనా, ఒకనాడు కాకున్న మరొకనాడైనా ఆ ధనికుని దరిద్రులందరు చేరి, పీడింపకమానరు. తమ తోడివానినిగా (దరిద్రునిగా) జేయక మానరు. ఒకవేళ కొలదికాలం ధనికుడుగానే ఉండగలిగినా నిత్యం భయంతోనే కాలం వెళ్ళబుచ్చుతూ ఉంటాడు. హాయిగా - సుఖంగా రాత్రులందు నిద్రింపజాలడు. ఏలయనగా - పేదరికంతో ఇరుగుపొరుగువా రందరు బాధపడుతూ ఉంటే మధ్యలో ఒకడు సుఖంగా ఎట్లు జీవిస్తాడు? అతడు సుఖంగా జీవించాలంటే హాయిగా నిద్రించాలంటే ఇరుగుపొరుగువారికి గూడ సుఖం, శాంతి ఉండాలి. అప్పుడందరు సుఖంగా ఉండగలుగుతారు.

ఇట మరొక విషయం గమనింపవలసి ఉంది. ఏమంటే - మనుష్యుడు సంఘజీవిగదా! కనుకనే అతడు ఇతరులతో - ఇరుగుపొరుగువారితో ఎట్లు మెలగాలో, ఏడవనియమంలో వివరించడం జరిగింది. మనుష్యుడు ఒంటరిగ జీవింపలేడు. మానవుడే కాదు. సాధారణంగా ప్రాణులన్నియు నంతే కనుక వ్యక్తియొక్క ఉన్నతిగాని అవనతిగాని ఇరుగుపొరుగువారి పైనను, సంఘముపైనను, దేశముపైనను ఆధారపడి యుండునని గమనించాలి.

అసలు ఉన్నతి యనగా నేమి? అది ఒక రకం గాదు. పతితావస్థ నుండి పైకివచ్చుట ఉన్నతి. ఆచార విచారములలో బాగుపడుట ఉన్నతి. జ్ఞానం పెంచుకొనుట ఉన్నతి. జీవనావసరములగు ధన కనక వస్తు వాహనాదులయం దాధిక్యము సంపాదించుట ఉన్నతి. ఇట్లు సర్వ విషయములలో ఐహికముగ ఆముష్మికముగ అభివృద్ధిని సాధించుటయే ఉన్నతి యనబడుతుంది.

ఇట్టి ఉన్నతిని వ్యక్తి తాను స్వయంగా - ఒంటరిగా పొంది సంతోషింపజాలడు. ఉచితమును గాదు. ఏలయన - తన యున్నతికి సమాజమే కారణం. సమాజం లేకున్న వ్యక్తియొక్క ఉన్నతి అసంభవం. వ్యక్తి ఏమి సంపాదించినా - కూడబెట్టినా, సమాజంనుండియే సంపాదిస్తాడు - కూడబెట్టుతాడు. వ్యక్తి జీవనమునకు వాడుకొను ప్రతివస్తువు పలువురిచేతులలో తయారై వస్తూ ఉంటుంది. వస్త్రం తయారు కావాలి అంటే కర్షకుడు పలువురు కూలీలసాయంతో శ్రమచేసి భూమినుండి ప్రత్తి పండిస్తాడు. దానిని గింజలు తీసి దారంగా వడికి వస్త్రం తయారుచేసేవరకు పలువురు శ్రామికులు శ్రమపడుట జరుగుతుంది. ఇట్లు పలువురిశ్రమకు ఫలితంగా వస్త్రం సిద్ధమవుతూ ఉంటుంది. ఏ ఒక వ్యక్తియు వస్తువును సంపూర్ణంగా నిర్మింపజాలడు. అందువల్ల ఏమి కూడబెట్టినా అది సమాజం నుండియే అని గ్రహించాలి. ఒక్క వస్తుసంపాదనయే గాదు. తుదికి వ్యక్తియొక్క ఆరోగ్యంకూడ సంఘంపైని ఆధారపడియే ఉంటుంది. గ్రామంలోని వీధులు, దొడ్లు, జలాశయములు శుభ్రంగా లేకున్న అందలి యొక కుటుంబం గాని వ్యక్తిగాని ఆరోగ్యంతో ఉండగలుగునా? అసంభవం. ఇరుగుపొరుగు వారి తోడ్పాటు లేకుండ ఒక వ్యక్తి ఆరోగ్య

నియమముల పాటింపజాలడు. కనుక సమాజ సుఖదుఃఖములపై వ్యక్తి సుఖదుఃఖములు ఆధారపడియుండునని, సమాజ-ఉన్నతిపై వ్యక్తి - ఉన్నతి ఆధారపడియుండు ననియు గ్రహించాలి.

స్వార్థం వలన అశాంతి

కాని సాధారణంగా ప్రతివాడు తన యున్నతికి, తన కుటుంబం యొక్క ఉన్నతికి పాటుపడుతూ ఉంటాడు. ఏదో విధంగా తనపని గట్టెక్కితే చాలునని అతడు భావిస్తూ ఉంటాడు. దానివలన సమాజానికి, దేశానికి ఎంత నష్టం సంభవించినా లెక్కచేయడు. పట్టించుకోడు. దీనికి కారణం ఏమి ? స్వార్థమే; సంకుచిత భావమే; దూరదృష్టి లేకుండటయే దీనికి హేతువు. అంటే - బాగా ఆలోచిస్తే అజ్ఞానమే దీనికంతకు మూలకారణం అవుతుంది. దీనివలన అనగా వ్యక్తుల స్వార్థపరత్వంవలన సమాజంలో అభివృద్ధి కుంటుపడుతుంది. ఐకమత్యం నశిస్తుంది. దానితో అశాంతి యేర్పడుతుంది. ఎవ్వరికీ సుఖం ఉండదు. శాంతి ఉండదు.

స్వార్థం ఉన్నచోట ప్రేమ ఉండదు. ప్రేమ లేనిచోట ఐకమత్యం నశిస్తుంది. కనుక తన్ను ప్రేమించుకొను స్వభావమును విస్తరింపజేసి తన కుటుంబమును, పరివారమును ప్రేమించుచున్నట్లు గానే మరికొంత విస్తరింప జేస్తూ, క్రమంగా తనవీధివారిని, గ్రామమువారిని, రాష్ట్రమువారిని, దేశస్థులను తుదికి ప్రపంచమునే ప్రేమించడం అభ్యాసం చేయాలి. ఒక్క మనుష్యజాతినే కాదు. సర్వజీవులను ప్రేమించునట్లు తయారు కావాలి.

**"సర్వే భవంతు సుఖినః సర్వే సంతు నిరామయాః ।**
**సర్వే భద్రాణి పశ్యంతు మాకశ్చి ద్దుఃఖ భాగ్భవేత్ ॥"**

**'సమస్త జనులు ఆరోగ్యం కలిగి సుఖములను, శుభములను సదా పొందుదురుగాక! ఏ యొకరు దుఃఖమును పొందకుండుగాక!' అను దివ్యభావన కలిగి మెలగాలి.**

అప్పుడే తన యున్నతితో పాటు సమాజం యొక్క ఉన్నతికి కూడ పాటు పడడం జరుగుతుంది.

ఇట భర్తృహరి నీతిశతకములోని పద్యమునుకూడ స్మరించుట ముఖ్యం.

" ఏతే సత్పురుషాః పరార్థఘటకాః స్వార్థాన్ పరిత్యజ్య యే
సామాన్యాస్తు పరార్థ ముద్యమభృతః స్వార్థా విరోధేన యే ।
తేzమీ మానుషరాక్షసాః పరహితం స్వార్థాయ నిఘ్నంతి యే
యే తు ఘ్నంతి నిరర్థకం పరహితం తే కే న జానీమహే ॥

దీనికి తెలుగు అనువాదము -

"తమ కార్యంబు పరిత్యజించియు పరార్థప్రాపకుల్ సజ్జనుల్
తమ కార్యంబు ఘటించుచున్ పరహితార్థప్రాపకుల్ మధ్యముల్
తమకై యన్య హితార్థ ఘాతుక జనుల్ దైత్యుల్, వృథాన్యార్థభం
గము గావించెడివార లెవ్వరొ యెఱుంగన్ శక్యమే యేరికిన్॥ "

'స్వార్థము వీడి పరార్థము పాటు పడువారు సజ్జనులు - ఉత్తములు. స్వార్థముతో పాటు పరార్థము పాటుపడువారు మధ్యములు. స్వార్థముకొఱకు పరులకు అహిత మొనర్చువారు దైత్యులు - నీచులు. ఇక తమకు లాభము లేకున్నను పరులకు అహిత మొనర్చువారిని ఏమనవలెనో తెలియదు.' అని యిందలి భావము.

**వ్యక్తి - సమాజముల యున్నతిలో నేది ముఖ్యము ?**

ఇట్లు భర్తృహరి దృష్టిలో కేవలం పరార్థము పాటుపడువారికి ప్రాధాన్యత యీయబడినది. వారే ఉత్తము లనబడుతూ ఉంటారు. మధ్యము లయినవారు స్వార్థం చూచుకుంటూ పరార్థముకూడ పాటుపడుతూ ఉంటారని చెప్పబడినది. మన యీ తొమ్మిదవ నియమం ప్రతివ్యక్తి తన యున్నతితో సంతృప్తిపడక అందరి యున్నతిలో తన యున్నతి కలదని తలంపగోరుచున్నది. కనుక పై భర్తృహరి దృష్టిలో ఈ నియమపాలకులు ఏ తరగతిలోనికి వస్తారు. మొదటి ఉత్తముల తరగతిలోనికా? లేక రెండవదైన మధ్యముల తరగతి లోనికా? అని యాలోచించుచో రెండు విధములుగాను వ్యాఖ్యానించుటకు - భావించుటకు - వీలుగా నున్నట్లు నియమం కనబడుతున్నది. ఎట్లనగా -

'అందరి ఉన్నతిలో తన యున్నతి కలదని తలంపవలెను' అను వాక్యాన్ని ప్రధానంగా భావించి చూచినచో అందరియున్నతి ముఖ్యమనియుతన (వ్యక్తి) యున్నతి దాని ననుసరింపవలెననియు లేకున్న ఉన్నతి నందని

ఇతరులవలన బాధ కలుగుననియు బోధపడుతుంది.

ఆ పక్షంలో ఈ నియమ పాలకులు మొదటి - ఉత్తముల తరగతికి చెందినవారుగా ఉంటారు. లేదా -

'ప్రతివ్యక్తి తన యున్నతితో సంతృప్తిపడక' - అను వాక్యాన్ని ప్రధానంగా భావించి చూచినచో తాను ఉన్నతిని బొంది, తృప్తిపడరాదనియు తదనంతరము అందరి (సాటివారి) యున్నతికి కూడ పాటుపడి అందరు తృప్తిపడుచుండ తాను తృప్తిపడవలెననియు బోధపడుతుంది. ఆ పక్షమున ఈ నియమపాలకులు తనయున్నతి చూచుకొంటూ ఇతరుల యున్నతికి కూడ పాటుపడుతూ ఉంటారు; కనుక భర్తృహరి దృష్టిలో మధ్యముల (రెండవ) తరగతికి చెందినవారుగా ఉంటారు.

ఈ రెంటిలో నార్యసమాజ నియమముల నేర్పఱచిన మహర్షి దృష్టి యేది? ఈ నియమరచనలో మహర్షి భావమేమి? అని యాలోచించినచో మొదటితరగతికి చెందియున్నట్లే గ్రహించాలి. ఎందుకంటే - సత్యం చెప్పుటలో, నీతిని బోధించుటలో మహర్షికి మధ్యేమార్గంలేదు. రాజీపద్ధతి లేదు. ఉన్నదున్నట్లు చెప్పవలసినదే. బోధింపవలసినదే. ఇతరుల రాగద్వేషాలకు జంకు - లొంగు - స్వభావం లేదు. అందువల్ల నూటికి నూరుపాళ్ళు మంచినే - సత్యమునే మహర్షి అభిలషిస్తారు. ఆచరింపగోరుతారు. విశేషించి ఆర్యసమాజ సదస్యుడు పాటించు నియమాలలో ఉత్తమకక్ష్యకు చెందిన సదస్యుడు గానే ఉండవలెనని చెప్పుతారు. కాని మధ్యమ కక్ష్యకు చెందినవాడుగా కూడ ఉండవచ్చునని అంగీకరింపరు. దీని తరువాత పదియవ నియమం కూడ ఇదే భావాన్ని - అనగా 'సంఘ శ్రేయస్సు ముఖ్యం' అనే భావాన్ని వెల్లడిస్తూ ఉన్నది.

ఇంతయేల! ఆర్యసమాజమనగా సజ్జనుల సంఘమని గదా అర్థం ! కనుక ఆర్యసమాజ సదస్యులు సజ్జను లగుటకు పరార్థ ప్రాపకులు కావలసినదే. సమాజ నియమంకూడ అట్లే ఉంటుంది; ఉండాలి. అయితే అంతమాత్రాన స్వార్థం వీడవలెనని నియమోద్దేశ్యముగ భావింపరాదు. ముందు పరార్థము; తరువాత స్వార్థము. అని గ్రహించాలి.

సమాజోన్నతి లేనందున నష్టము

ఈ విషయంలో మరికొంత చెప్పి యీ నియమ వ్యాఖ్యానమును ముగిస్తా.

విద్య, బలము, గుణము, సంపద - యేదైననూ దేశంలో కొలది మందిలో మాత్రమే ఉండటం మంచిదికాదు. అట్లు ఉన్నను లేకున్నను ఒకటే అవుతుంది. అవి అందరిలో ఉండదగినవి. అట్లున్నప్పుడే దేశంలో అధిక సుఖం లభిస్తుంది. అట్లుగాక కొలదిమందిలోనే అవి ఉన్నచో వారు దేశాభివృద్ధికి పాటుపడజాలరు. సరికదా, దేశ స్వాతంత్ర్యాన్ని కూడ రక్షింపజాలరు.

చూడండి : ఒకప్పుడీ భారతదేశమునందు శస్త్రశాస్త్రములు కొలది మంది యధీనంలో ఉండి సర్వజన సాధారణములు కాకుండెను. అందుచేత ఇతరుల (విదేశీయుల) యాక్రమణకు ఈ దేశం లోను గావలసివచ్చింది. ఎట్లంటే :

ఒకప్పుడు స్త్రీ శూద్రులకు విద్య నిషేధింపబడినది. శస్త్రశాస్త్రముల పై అధికారం వహించువారు కొలదిమందే యుండిరి. వారు నశింపగా దేశం నిర్వీర్యం, జ్ఞానశూన్యం అయి పరుల చేతులలో బడింది. రాజకీయ, ధార్మిక, స్వాతంత్ర్యములను కోల్పోయింది. అట్లుగాక సర్వసాధారణముగ భారతీయు లెల్లరు ధనుర్వేదముద్వారా శస్త్రాస్త్రముల ప్రయోగములు ఎరిగి యున్నచో విదేశీయుల - పరాయిజాతుల - పాదాక్రాంతు లేల కావలసి యుంటారు. విధినిషేధములు లేక వేదాది ధర్మశాస్త్రములు స్త్రీశూద్రాదు లెల్లరు చదివి యున్నచో - ఈ మహమ్మదీయులు, క్రైస్తవులు భారతమున ఎట్లేర్పడి యుంటారు? ధర్మమన్న నేమో యెరుంగని సంఘములవారే - మనచే అణచబడి హీనంగా చూడబడిన వారే - నేడు పరధర్మావలంబులై మనకు గర్భశత్రువులుగా పరిణమించారు. ఇంకను పరిణమిస్తున్నారు. ఈ యనర్థమంతా పండితులు - ఆర్యులు - కొందరు అందరియున్నతిలో తమ యున్నతి కలదని యెరుంగని దోషముచేతనే చేతులార దెచ్చిపెట్టారు. మధ్యకాలంలో అజ్ఞానంవల్లగాని, స్వార్థంవల్లగాని భారతదేశమున కొందరుమాత్రం తాము విద్యాసంపన్నులమై శస్త్రాస్త్రబల ప్రయోగముల నెరింగియున్న చాలునని తలంచారు. అట్టివారు తమ ప్రాణములతోపాటు విద్యలనుగూడ తమతో

గొంపోయారు. అందువలననే విద్యా, బల, గుణ, సంపదలు కొలదిమందిలో నుండుట లేని దానితో సమాన మన్నాము.

విదేశీయులరాజ్యం ఎంత మంచిదిగా ఉన్నా సంపూర్ణ సుఖదాయకం కానేరదని చెప్పిన, మహర్షి దయానందసరస్వతి యీ పరిస్థితు లన్నియు దీర్ఘంగా ఆలోచించియే యీ తొమ్మిదవ నియమంలో ఆర్యసమాజ సదస్యులు అందరి యున్నతికి పాటుపడవలెనని ఆదేశించారు. అందరి యున్నతిలోనే వ్యక్తియున్నతి కలదని గుర్తుచేశారు.

కాన ఈ నియమాన్ని పాలించువారు తమ విద్యాబుద్ధులను దాచరాదు. వానిని తోడివారిలో వ్యాపింపజేసి అందరియున్నతికి శుభకాములు కావలసి యున్నారు. ఈ విషయం మూడవనియమంలో స్పష్టంగా చెప్పబడియే ఉన్నది. అంతేగాదు. ఎనిమిదవ నియమంలో మరల గుర్తుచేయబడినది.

**ఈ నియమరచనకు ఆధారమగు మంత్రము**

"ఓం సంగచ్ఛధ్వం సంవదధ్వం సంవో మనాంసి జానతామ్."

(ఋ. 10-191-2)

మీరంతా కలిసి నడవండి. కలిసి మాటాడండి. కలిసి ఆలోచించండి.' అంటూ ఋగ్వేదమంత్రంలో మనోవాక్కాయ కర్మములలో కలిసి ఐకమత్యముతో ప్రవర్తించాలని మానవులకు భగవంతుని యాదేశం కనబడుతూ ఉన్నది .

ప్రవర్తనలోగాని సంభాషణలోగాని కలుపుగోలుతనం, ఐకమత్యం ఉంటేనే సాంఘికజీవనం సాగుతుంది. రాణిస్తుంది. లేకున్న కుంటుపడి వికటిస్తుంది.

ఇంతయేల ! కాళ్ళు రెండు ఒకదాని నొకటి అనుసరిస్తున్నప్పుడే మనిషి నడక సాగుతుంది. లేక అవి చెరియొకదారి అయితే యేమవుతుందో చెప్పాలా? అట్లే ప్రధాన గాయకునిపాటతో తోటి గాయకుడు స్వరం కలిపి పాడితేనే లయ కుదిరి గానం రాణిస్తుంది. శ్రోతల రంజింపజేస్తుంది. అట్లు గాక యిరువురి స్వరాలు భిన్నములైన నెట్లుండునో చెప్పాలా?

వేదమంత్రంలోని 'సంగచ్ఛధ్వం - సంవదధ్వం' పదాలు బోధిస్తున్న రహస్యంకూడ యిదే !

## పదియవ నియమము

అవ॥ వ్యక్తి తన యున్నతితోపాటు అందరి యున్నతికి పాటుపడాలని పూర్వనియమంలో చెప్పబడినది.అయితే వ్యక్తిధర్మమునకు సమాజ ధర్మమునకు సంఘర్షణ వచ్చినప్పుడు మనుష్యు డే మార్గమును అనుసరించాలి ? అను ప్రశ్న కలుగుతుంది. దానికి సమాధానమే యీ పదియవ నియమము

నియమము

**"సబ్ మనుష్యోంకో సామాజిక్ సర్వహితకారీ నియమ్‌పాల్‌నేమే పరతంత్ర రహ్‌నా చాహియే. ఔర్ ప్రత్యేక హితకారీ నియమమే సబ్ స్వతంత్ర రహే. "**

తా॥ సర్వహితకరములగు సామాజిక నియమములను పాలించుటలో పరతంత్రులై వ్యక్తి హితకరములగు నియమములందు స్వతంత్రులగుట అందరికి తగును.

మనుష్యులు సంఘజీవులు కనుక సంఘంయొక్క ఉన్నతి-అవనతులను బట్టి వ్యక్తియొక్క ఉన్నతిగాని, అవనతిగాని ఉంటుందని పూర్వనియమంలో చెప్పుకొని ఉన్నాం. కాబట్టి వ్యక్తికి సంఘానికి ఉన్న అవినాభావ సంబంధమును బట్టి వ్యక్తి ధర్మములేవో, సంఘధర్మములేవో తెలుసుకొని మనుష్యుడు ప్రవర్తింపవలసియుంటుంది.

### వ్యక్తి - స్వాతంత్ర్యము

సంఘమునకు అనగా సమాజమునకు హితకరములగు ధర్మములు ఒక్కొక్కప్పుడు వ్యక్తికి లాభదాయకములు కాకపోవచ్చును. అట్లే వ్యక్తికి లాభదాయకములయిన ధర్మములు సమాజమునకు నష్టదాయకములు కావచ్చును. అయినప్పుడు అనగా వ్యక్తి ధర్మమునకు సమాజ ధర్మమునకు సంఘర్షణ యేర్పడినప్పుడు మనుష్య డే మార్గమును అనుసరించాలి? అను ప్రశ్న కలుగుతుంది. దానికి సమాధానమే యీ పదవ నియమం.

తనకు హితకరములగు నియమములను పాలించుటలో వ్యక్తికి స్వాతంత్ర్యం ఉన్నది. కాని దానివలన సమాజమునకు అహితం కలుగరాదు. అనగా సమాజమునకు అశుభంకరము కాక (నష్టము కలిగింపక) తనకు మాత్రమే ఫలముతో సంబంధముండు కర్మమును [illegible] ఆచరింప వచ్చును

అందువలన సమాజమునకెట్టి హానియు ఉండదు. తానుమాత్రమే దానివలన శుభాశుభ రూపఫలం అనుభవిస్తాడు.

ఇక సమాజ నియమముల పాలించుటలో వ్యక్తి అస్వతంత్రుడు. శాస్త్రము, పెద్దలు, శిష్టులు నేధర్మములు సమాజమునకు ఏర్పరచినారో వానిని తప్పక వ్యక్తి పాటించాలి - ఆచరించాలి. అందువలన ఎటనేని క్వచిత్తుగా ఒక రిద్దరు వ్యక్తులకు ప్రయోజనం లేనట్లు తోచినా సహింపవలసినదే. అస్వతంత్రులై ఆచరింపవలసినదే. కాని తమకు ఉపకరింపలేదను నెపంతో స్వతంత్రించి వానిని ఎదురింపరాదు. అని యీ నియమం బోధిస్తూ ఉన్నది. అయినా లోతుగా ఆలోచించినచో మహర్షులు నిర్ణయించిన సామాజిక ధర్మములు సర్వహితకరములుగానే ఉంటున్నవి.

**సమాజ ధర్మముల ప్రాముఖ్యత**

చూడండి - వేదశాస్త్రముల యాధారంతో నిత్య నైమిత్తిక కర్మముల పేరిట గృహస్థాశ్రమ ధర్మములను మహర్షులు తమ గృహ్యాసూత్రములలో వివరించి యున్నారు. పంచమహాయజ్ఞములు నిత్యకర్మలు. షోడశ సంస్కారములు నైమిత్తిక కర్మలు. ఇవి రెండు సామాజిక ధర్మములు. వీటిని ఎల్లరు పాలించాలి. అట్లుగాక వ్యక్తులు స్వతంత్రించి వీటిని తలకొక రీతిగా ఆచరించినచో సమాజవ్యవస్థయే పాడవుతుంది. మేలునకు బదులుగా కీడు కలుగుతుంది. ఎట్లంటే -

అంత్యేష్టి సంస్కారమే ఉన్నది. వ్యక్తి చనిపోయినప్పుడు - అనగా జీవోత్క్రమణానంతరం శవమును - పాంచభౌతిక దేహమును - ఏమి చేయాలని ప్రశ్న కలుగుతుంది. అది అట్లే ఉన్నచో క్రుళ్ళి యితర ప్రాణులకు అపకారం చేస్తుంది. కాన వెంటనే పంచభూతములలో కలియునట్లు చేయాలి. అందుకు పంచభూతములే సాధనములు అవుతవి. అందు పృథివ్యాదులవలన ఆపని ఆలస్యంగా జరుగుతుంది. ఈ లోపల సమాజమునకు - ప్రాణులకు అపకారం కలుగవచ్చు. అట్లుగాక సుగంధ ద్రవ్యములతో ఇష్టివలె అగ్నిలో శవాన్ని దగ్ధం చేసినచో ఏ ప్రాణికి అపకారం చేయక సుమారు రెండు గంటలలోనే అది బూడిదపాలవుతుంది. అట్లు చేయవలెననియే

'భస్మాంతగ్ం శరీరం' - అని వేదం ఆదేశిస్తూ ఉంది. మహర్షులును ఆ దహనవిధానాన్ని తమ గృహ్యసూత్రములలో వివరించి ఉన్నారు. కాని నేడు లోకం దానిని సరిగా పాటించుటలేదు. అజ్ఞానవశమున భిన్న భిన్న సంప్రదాయములు వెలసి కొందరు శవాన్ని భూమిలో పూడ్చిపెట్టు (సమాధి చేయు) చున్నారు. కొందరు నీటిలో (నదులు మొ॥ వానిలో) వదలి వేయు చున్నారు. మరికొందరు పక్షుల కాహారముగ గుట్టలపై పారవేయుచున్నారు. చిత్ర మేమంటే - ఒకే సంప్రదాయము వారిలో కూడ పిల్లల శవములను సమాధిచేయుట, పెద్దల శవములను దహనముచేయుట, సంన్యాసుల శవములను నీటవదలుట చేయబడుచున్నది. ఇంకను దహనం చేసిన శవముల యెముకలను, బూడిదను నదులలో కలుపుటయు జరుగుచున్నది. ఏమీ యీ అచారములు? ధర్మం పేరుతో పుణ్యం పేరుతో ఈ పనులు జరుగుతూ ఉన్నవి. వీనివలన సమాజమునకు, ఇతర ప్రాణులకు ఎంత అపకారం, నష్టం జరుగుచున్నవో ఎవ్వరూ ఆలోచించుటలేదు. అంత్యేష్టి శబ్దములోని అర్థమును సైతం పండితులును గ్రహించుట లేదు. గ్రహించినా పాటించుటలేదు.

ఇట్లే యితర సంస్కారములును సరిగా పాటింపబడుటలేదు. అందువలన సాంఘికవ్యవస్థ నేడు తారుమా రయినది. పాడయినది. సుశిక్షితులయిన పౌరులు తయారగుట లేదు. కనుక సర్వహితకరములగు నియమములను పాలించుటలో మనుష్యులు అస్వతంత్రులుగ నుండవలె ననియే యీ నియమం ఆదేశిస్తూ ఉన్నది. అయితే సమాజ నియమము లేవి? వ్యక్తి నియమము లేవి? అను ప్రశ్న రావచ్చు. దానికి సమాధానం మహర్షులు చెప్పక పోలేదు.

**యమ నియమములు**

పతంజలి మహర్షి సమాజధర్మములను, వ్యక్తిధర్మములను కొన్నింటిని తన యోగదర్శనంలో యమనియమము లను పేర వివరించారు. మను మహర్షియు ఆ యమనియమముల రెంటిని పాలింపవలెననీ, విశేషించి యమముల నుపేక్షించి నియమముల మాత్రమే పాలించుట తగదని తన

ధర్మశాస్త్రంలో శాసించారు. (సత్యార్థ ప్రకాశము తృ. సము. నందు గురుశిష్య ధర్మముల జెప్పు సందర్భంలో మహర్షి దయానందసరస్వతి వానిని వివరించి యున్నారు.)

యమములు

"తత్రాహింసా సత్య మస్తేయ బ్రహ్మచర్యాపరిగ్రహా యమాః"

(యో. ద. సా. పా. 30)

(1) వైరత్యాగము (2) సత్యమే నమ్ముట - సత్యమే చెప్పుట - సత్యమే చేయుట (3) మనోవాక్కాయములచే చౌర్యము చేయకుండుట (4) ఉపస్థేంద్రియ నిగ్రహము (5) లోభము పూర్తిగ వదలి స్వత్వాభిమాన రహితు డగుట - ఈ అయిదు యమములను - అనగా సాంఘిక ధర్మములను - సర్వదా సేవింపవలెను.

నియమములు

"శౌచ సంతోష తపః స్వాధ్యా యేశ్వర ప్రణిధానాని నియమాః"

(యో. ద. సా. పా. 32)

(1) స్నానాదులచే పవిత్రత (2) సోమరిగా నుండక శక్తికొలది పురుషార్థము చేయుచు హానిలాభములయందు శోకహర్షములు లేకుండుట (3) కష్టముల కోర్చియు ధర్మానుకూలములగు కార్యములను అనుష్ఠించుట (4) చదువుట - చదివించుట (5) ఈశ్వరునియందలి భక్తివిశేషముచే ఆత్మనర్పించియుంచుట - ఇవి అయిదును నియమములు అనగా వ్యక్తి ధర్మములు.

యమములు సమాజమునకు సంబంధించిన ధర్మములు. వాటిని పాటింపనిచో సమాజమునకు చెరుపు గల్గును. ఎట్లన - అహింస యున్నది. ఇది సమాజ ధర్మం. దీనిని పాటింపక యితరులను హింసించుచో సమాజమున అశాంతి యేర్పడుతుంది గదా! అట్లే -

నియమములు వ్యక్తికి సంబంధించిన ధర్మములు. వీటిని పాటించుటకు గాని పాటింపకుండుటకుగాని వ్యక్తికి స్వేచ్ఛ ఉన్నది. ఎందువల్ల ననగా - వీటిని పాటించిన కలుగు లాభంగాని, పాటింపకున్న కలుగునష్టంగాని వ్యక్తియే అనుభవిస్తాడు. ఎట్లంటే - శౌచ మున్నది. ఇది వ్యక్తికి సంబంధించినది. దీనిని

పాటించిన వ్యక్తి ఆరోగ్యము కలిగి సుఖిస్తాడు. పాటింపని వ్యక్తి అనారోగ్యముతో బాధపడతాడు. దీనితో సమాజమునకు సంబంధము తక్కువ.

**"యమాన్ సతతం సేవేత న నియమాన్ కేవలాన్ బుధః ।**
**యమాన్ పత త్యకుర్వాణో నియమాన్ కేవలాన్ భజన్ ॥**

(మను. 4-20)

'యమములను వదలి కేవల నియమములను మాత్రమే సేవింపగూడదు. ఈ రెంటిని సేవించాలి. యమములను వదలి నియమములను మాత్రమే సేవించువాడు ఉన్నతిని పొందక అధోగతిపాలై సంసారమందు హీనుడుగ పడియుంటాడు.'

అంటూ మను మహర్షియు సమాజధర్మములకు ప్రాధన్యత యిచ్చియున్నారు.

లోకంలో నిత్యం మన అనుభవంలో ఉండే ఉదాహరణలతో ఈ నియమాన్ని గురించి మరికొంత వివరింపవలసియున్నది.

మనుష్యుడు సంఘజీవి. కనుక మానవ జీవనవిధానంలో సాంఘిక ధర్మములకు ప్రాధాన్యత ఉండక తప్పదు. అనాదిగా వచ్చుచున్న సాంఘిక జీవనంలో ఆ ధర్మాలు పాటింపబడుతూనే ఉన్నట్లు మన నిత్యజీవన విధానం పరిశీలిస్తే అర్థమౌతుంది.

చూడండి : సాంఘికజీవనం అనగా సంఘమునకు సంబంధించిన జీవనం. అంటే సంఘముయొక్క జీవనం అనిగదా అర్థం. అప్పుడు సంఘం అంటే ఎవరు? ఎంతమంది? అని ప్రశ్నిస్తే సమాధానం ఏమిటి? ఒకరికి మించి ఎంతమంది ఉన్నా సంఘం అనే చెప్పవచ్చు. అనగా ఇద్దరున్నా, ముగ్గురున్నా, లేక పదిమంది ఉన్నా సంఘం అనవచ్చు. దీనిని బట్టి ఒకరు మరొకరితో కలిసి జీవించడమే సాంఘికజీవనం అనబడుతుంది.

అందువల్ల భార్యాభర్తల సహజీవనం, కుటుంబసభ్యుల సహజీవనం, గ్రామస్థుల సహజీవనం, లేదా దేశీయుల సహజీవనం - ఇట్లు అన్నియు సాంఘిక జీవనం క్రిందకే వస్తవి.

ఇట్టి యీ సాంఘిక జీవనవిధానంలో సంఘధర్మమునకు మర్యాదకు

ప్రాధాన్యత, గౌరవం యిస్తూ వ్యక్తి తన స్వేచ్ఛను, సౌఖ్యమును తగ్గించుకొని నడవడం చూస్తూనే ఉంటాం. ఎట్లంటారా?

1. ఒక కుటుంబంలో భార్యాభర్తలిద్దరే ఉన్నారు. భర్తయొక బడిలో పంతులుగా పనిచేయున్నాడు. నిత్యం ఉదయం పదిగంటలకే బడికి వెళ్ళాలి. కాన భార్య ఉదయం 9-30 గంటలకే వంటచేసి భోజనం పెట్టి భర్త వేళతప్పకుండ బడికి వెళ్లునట్లు సాయపడాలి. కాని భార్య కొంచెం బద్ధకస్తురాలు. పెందలకడ నిద్రలేచే అలవాటు ఆమెకు లేదు. అయినప్పుడు ఏమి జరుగుతుంది? ఆమె తన అలవాటును, స్వేచ్ఛను, సౌఖ్యమును తగ్గించుకొని పెందలకడ లేచి భర్తకోసం కనీసం ఒక కూరతో నైనా వేళకు 9-30 గంటలకే వంటచేసి భోజనం పెట్టుతుంది.

అట్లే భర్త సాయంకాలం ఐదుగంటలకు బడి విడువగానే ఇంటికి చేరుతాడు. కాని అట్లు చేరకుండ ప్రొద్దుపోవువరకు పార్కులలో, క్లబ్బులలో కాలము గడుపు స్వేచ్ఛ అతనికున్నది. అయితే తన జీవనంలో మరొకరిని సహధర్మచారిణిగా స్వీకరించాడు. కాన తన స్వేచ్ఛను, సౌఖ్యమును తగ్గించుకొని 'ఇంతకు రాడు కాంతు డని యింతి విచారముతోడ ద్వారబంధాంతరమందు నిల్చి కను లార్పక దారులు చూచుచున్న' ఆమె కొరకు బడి విడిచినవెంటనే యింటికి చేరుతాడు.

2. ప్రక్క ఇంటివారు ధార్మిక ప్రవృత్తికలవారు. ఆ యింటి యిల్లాలు రాత్రివేళ భగవద్భక్తితో హార్మోనియం పెట్టుకొని కీర్తనలు పాడుకొంటున్నది. కాని భర్త వలదని వారిస్తున్నాడు. అంతట ఆమె 'నేను భగవంతుని గానం చేస్తున్నాను. ఏల వారిస్తున్నారు? అని అడుగుతుంది. అప్పుడు భర్త ఆమెను - 'భగవద్భక్తిని ప్రదర్శించుటలో నీకు స్వాతంత్ర్యం ఉన్నది. కాని ప్రక్కవారికి నిద్రాభంగం కలిగింపరాదుగదా!' అని మాన్పిస్తాడు.

3. ఒక గృహస్థు తన యింటిలో ఏదో సందర్భంలో పిల్లలను కోపగిస్తున్నాడు. భార్యనుకూడ గట్టిగా మందలిస్తున్నాడు. ఇంతలో నెవరో వచ్చి తలుపు తట్టారు. లేదా కాలింగ్ బెల్ నొక్కారు. అప్పుడేమి జరుగుతుంది? ఆ గృహస్థు ఉద్రేకం చంపుకొని, మాటలుమార్చి ముఖముపై చిరునవ్వు నటిస్తూ

గుమ్మము తెఱచి తనకొఱకు వచ్చిన పెద్దమనిషితో సాదరంగా సంభాషణ సాగిస్తాడు.

4. ఒక గృహస్థుకు భోజనంలో ఉప్పు,కారం జాస్తిగా తినే అలవాటు ఉన్నది. అత డొకనా డొక పెద్దమనిషిని విందుభోజనానికి ఆహ్వానించాడు. కాని ఆ పెద్దమనిషి సాత్వికాహారి. ఘాటయిన మసాలా కూరలు తినడు. అప్పుడేమి జరుగుతుంది. ఆ గృహస్థు అతిథికి అనుకూలమైన పదార్థములతో రుచికరమున సాత్వికభోజనం తయారు చేయించి తానుకూడ అతిథితో సహపంక్తిని భోజనం చేస్తాడు. ఇట్లు గృహస్థు అతిథికొరకు తన అలవాటును మార్చుకొన్నాడు.

వీటినిబట్టి ఏమి తేలుచున్నది ? వ్యక్తి తనకు సంబంధించి నంతవరకు స్వతంత్రుడుగానే యుంటున్నాడు. కాని ఏ కార్యములతో ఇతరులకు సంబంధము కలుగుచున్నదో ఆ కార్యములందు తన స్వాతంత్ర్యమును, సుఖమును అరికట్టి ఇతరుల సుఖం కొరకు, తృప్తి కొరకు పాటు పడుచున్నాడు. అంటే ఇతరులకు (సంఘమునకు) సంబంధం ఉన్న విషయాలలో పరతంత్రుడుగా మెలగుచున్నా డన్నమాట.

ఇవి నిత్యం అనుభవంలో ఉండే విషయాలే అయినా అందలి ధర్మ సూక్ష్మతను భారతీయులు గుర్తింపలేకున్నారు. దానికి కారణం పరాయి సంస్కృతులు మూలకంగా భారతీయుల సంస్కృతి, ధర్మం కలగా పులగ మగుటయే. తమ ధర్మమేదో కూడ సరిగా తెలియని స్థితిలో నేడు భారతీయులు చాలమంది ఉన్నారు. వ్యక్తి సంఘానికి లోబడి నడవాలన్నది భారతీయుల ధర్మం. దానికి వ్యతిరేకం పాశ్చాత్యుల ధర్మం. పాశ్చాత్యుల పరిపాలనములో భాషతోపాటు పాశ్చాత్యుల సంస్కృతి, ధర్మం భారతీయుల కలవడినందున భారతీయుల కీ స్థితి యేర్పడినది.

అందుకనే మహర్షి దయానంద సరస్వతి యీ పదియవ నియమంలో సాంఘిక ధర్మంయొక్క ప్రాధాన్యతను గుర్తింప జేస్తున్నారు. పునరుద్ధరిస్తున్నారు.

## సింహావలోకనము - 1

(దశ నియమముల సంక్షిప్త తాత్పర్యం)

1. పరమేశ్వరుడు జ్ఞానమునకు నిలయమని, జ్ఞేయ పదార్థములక నిమిత్తకారణం - ఆధారం అని మొదటి నియమం తెలుపుతూ ఉన్నది.

2. రెండవ నియమం ఆ పరమేశ్వరుని స్వరూపం వర్ణించి అత యుపాసనయే మానవులకు కర్తవ్యం అని బోధిస్తూ ఉన్నది.

3. సమస్త సత్యవిద్యల కాకరమైన వేదం ఈశ్వరీయం. కనుక దా పఠనపాఠనములు, శ్రవణశ్రావణములు ఆర్యులకు పరమధర్మం అంట మూడవ నియమం చెప్పుతూ ఉన్నది.

4. ఈ పరమధర్మం పాలించుటయేగాక సదా సత్యం గ్రహించటాని అసత్యం త్యజించటానికి సిద్ధంగా ఉండాలని నాల్గవ నియమం హెచ్చరిస ఉన్నది.

5. అంతేగాదు. సత్యాచరణకు ముందు సత్యాసత్యవివేచ అవసరమని అయిదవ నియమం ఆదేశిస్తూ ఉన్నది.

6. ఇక ప్రపంచమునకు ఉపకార మొనర్చుటయే ఆర్యసమాజ స్థాప గల ముఖ్యోద్దేశ్యం అని ఆఱవ నియమం స్పష్టం చేసినది.

7. సంఘజీవి కనుక మానవుడు అందరితో ప్రీతి పూర్వకం ధర్మానుసారంగా, యథాయోగ్యంగా ప్రవర్తించాలని యేడవ నియమం బోధి ఉన్నది.

8. అయితే ప్రేమవల్ల మానవులకు అజ్ఞానం ఆవరించి కర్త దూరుడయ్యే ప్రమాదం ఉన్నది. కనుక అవిద్యను నశింపజేసి విద్య పెంపొందింపవలెనని యెనిమిదవ నియమం హెచ్చరిస్తూ ఉన్నది.

9. ఇట్లు విద్యావ్యాప్తికి ప్రయత్నించు ప్రతివ్యక్తి తన యున్న సంతృప్తిపడక అందరి యున్నతిలో తన యున్నతి కలదని భావించా తొమ్మిదవ నియమం చెప్పుచున్నది.

10. అంతేగాదు. స్వహితకరములగు నియమములను పాలించుట వ్యక్తి స్వతంత్రుడైనా సమాజహితకరములగు నియమములను పాలించుట అస్వతంత్రుడై మెలగాలని పదియవ నియమం గుర్తు చేస్తున్నది.